గీ॥ తొర నీదుండఁగఁబంత ♦ నడుగుఁ బట్టి
యభవుపై తేగి పొందితి ♦ వతను వింక
మూలఁబడియుండ కీరితి ♦ మోహ జలధి
ముంప శరముల సంధింపఁ ♦ బూంచినావ! 75

వ॥ అని నెచ్చెలులంగాంచి. 76

గీ॥ సరసమతులార! మునపటి ♦ మరుఁడు కాడు
యింత నొప్పించు వాఁడని ♦ యెన్నఁ డెఱుఁగ
నిండువెన్నెల నేయుచే ♦ మండఁ జేసి
చంపుచున్నాఁడు చంద్రుండు ♦ జలువ చంపు. 77

సీ॥ అహికన్నియలుబిత్రి ♦ నారగించుయుపీడ
బవనుని తెక్కలు ♦ భగ్నపడవె!
చెలఁగి మామిడిపండ్లఁ ♦ గలజీడి చేఁజిక్క
గమి నాలుకలు పొక్కి ♦ కమలి పోవె!
మదనముల్ వాసన ♦ కోదమ తుమ్మెదలకుఁ
దగిలి ప్రాణముపీడి ♦ తన్నుకొనవె!
చిగురుటాకుల మేసి ♦ చెలఁగు కోకిలలకు
వడికిరాతుఁడు జాలిఁ ♦ బట్టుకొనఁడె

గీ॥ చెఱుకునుంబట్టి చీమలు ♦ ఛిద్రవఱుప
బువ్వుఁ దేరును నాయూర్పుఁ ♦ బోనడంగ

మదనుగర్వంబు నంతట ♦ మాయమయ్యె
విన్ననంజెంది యరుగఁడే ♦ విడిచి కన్నుఁడు 78

వ॥ ఇట్లు బహుప్రకారంబుల సుమబాణవికారంబులకుఁ గలాపంబులుగాఁ బ్రలాపంబుల నెఱపుచు నర్మగర్భంబుగా సఖీజనంబులాడిన సల్లాపంబులఁ దలంచుచు నాభీష్మకరాజపుత్రి గాంధర్వంబున శ్రీకృష్ణుండు దనుగ్రహణంబొనర్పఁ గలండనిమనంబుననాసించుచుఁ జీమచిటుక్కుమన్న వాసుదేవునిరాక గాఁ జింతించి దిగ్గునలేచి నలువంకలంబరికించి కానకఁగళవళించుచుఁ జింతాపరిక్లాంతయై గనుంగవమూసియు మాయమి శ్రీహరినింగలయంగాంచి బయలుగౌఁగలించుచుఁ బలవరించుచుఁ గుందుచుం బొరలుచుఁ దెరలుచుఁ గసరుచు వేసరచు, నుస్సురనుచు, నస్సురనుచు నుల్లంబున దెల్లంబోయి మూర్ఛిల్లెడినయ్యబ్జాతలోచనంగాంచి సఖీజనంబులింకయు శీతలోపచారంబులుం జేయఁదొడంగి, వీవనలవిసరుచుండఁ గొంతవరకావిద్రుమోష్ఠి కనుంగవఁదెఱచి బహిఃప్రాణులగు నెచ్చెలులంగాంచి 79

చ॥ విసరకుఁడమ్మ! వీవెనల ♦ వీచినఁ దత్పవనంబు తాకుచే
నసువులువాయునమ్మ! మదనాంకురమింకయు హెచ్చునమ్మ! పూ

రసములతోడఁ బయ్యెరుఁడు ♦ రాణఁజెలంగియుఁ దేంట్లఁదెచ్చినా
దెసనిడఁగాఁగలందు సుద ♦ తీ మణులార! వివేకహీనతన్, 80

గీ॥ తెల్లవారిన వెనుక మ ♦ దీయహృదయ
వల్లభుండైన కృష్ణుండు ♦ వచ్చుఁగాన
భావజునిచేతఁ జిక్కనేఁ ♦ జావకుండ
నంతదనుకను నరయుఁడో ♦ యమ్మలార! 81

సీ॥ అంత నెచ్చెలులంత ♦ నానందమున లేచి
విమలమృణాల హా ♦ రములవైచి
పన్నీరు నొకకొన్ని ♦ పద్మమ్ములంజేర్చి
తోరంబుగాఁ జను ♦ దోయిఁగట్టి
పద్మమ్ములందున ♦ భాసిల్లు బిళ్లలఁ
బొందుగాఁ దలకిందఁ ♦ బందఁజేసి
పూదేనియలతోడ, పుష్పాడి మర్దించి ♦ పదునుగా మేనునఁ, బట్టఁజేసి
గీ॥ చలువచిగురులఁ బాద ర ♦ తులనుఁ జేసి
కటిభరంబున విరులు గా ♦ గర ఘటించి
పొన్నపొగడల నలుదిశల్ ♦ పొందుఁ బఱచి
చెలులుజేసిరి యొకకొంత ♦ శీతకృతులు 82

గీ॥ కాని నయమించుకేనియుఁ ♦ గానఁబడదు,
అంతకంతకు సంతాప ♦ మగ్గలించె.

నినుఁడు దాఁగిన జలమయ్యె ♦ నింతిమేను!
కానఁగారాదు శైత్యోప ♦ కారమెటులొ! 83

క॥ చదువుల వినలేదెటు లీ
మదవతి విరహాగ్ని నణఁచు ♦ మార్గము, మరియే
సుదతియు నిటుపరితాపముఁ
గదియంగా జూడలేదు ♦ క్ష్మాతలిలోనన్. 84

వ॥ అనియిట్లు తమదేవికింగల విరహతాపోప శాంతినింగూర్ప చెలికత్తియలు నానావిధముల విచారించుసమయంబున.

ఉ॥ తోయజబాంధవుండలరి♦తూరుపుకొండకు రాఁదలంచె భూ
నాయకపుత్రికామణి ఘ ♦ నంబగు సూనశరాగ్ని వేదనం
గాయముఁదల్లడిల్లెనుపి♦కంబులు! కూయకుడంచుఁగొక్కు రో
కోయని బిట్టుమ్రోసెదొలి♦కోడిగృహంబులసారెసారెకున్

వ॥ తదనంతరంబ. 87

సీ॥ అసమాన గరిమచే ♦ పసఁగల్గు మల్లికా
కుసుమగుచ్ఛములపైఁ ♦ గోర్కెనలరి
విమలంబునై వెల్గు ♦ కమలాతటింజేరి
పద్మగంధంబుల ♦ వడసిప్రీతిఁ
గమనీయ శీతలా ♦ కరమైన కదళికా
వనములఁ దిరుగాడు ♦ వన్నెఁగాంచి

మాలతీమందార ♦ మంజీరములదూరి
సౌజన్యలీలలు ♦ జరిపి జరిపి

గీ॥ యతుల గతులగు రతులతో ♦ నలసినట్టి
సతుల పతులకుఁగల ఘర్మ ♦ జలముఁబాపి
ముదముఁ గూర్చుచసంతోష ♦ మునఁజెలంగి
చల్లఁగా వీచె గాలి యా ♦ సమయమందు, 88

క॥ తూరుపు తెలతెలవారఁగ
దారల గృహదీప తతులు ♦ తమలోఁదామే
సారవిహీనంబగుచును
తోరమ్మగు కళలఁబాసి ♦ తోఁచఁగ దొడంగెన్. 89

మ॥ భిసినీకాంత మనోవ్యథన్ గలిగి త ♦ ద్భీతాహతిన్ చింతనా
గ్రసిమైయుంట నెఱింగి వైద్యుఁడను న ♦ క్కాలమ్మాయుండంత నే
ర్పెసగన్ దద్రుజఁబాపభద్రమతుఁడై యింపొందఁగా దెచ్చుబల్
రససింధూరపు టుండగాదనరు మా ♦ ర్తాండుండు పూర్వాద్రిపై.

గీ॥ అబ్జములఁ జేరి భ్రమరము ♦ లలరి మధుర
గానములఁజేసి "మీప్రాణ ♦ కాంతుఁడైన
యర్కుఁడే తెంచె లెమ్మను" ♦ నటుల బిట్టు
మ్రోయు దొడఁగెను కుముదముల్ ♦ మొగము ముడువ.

గీ॥ కష్టతరముగ రేయెల్లఁ ♦ గడపి భైష్మి
దత్తరిల్లుచు వేకువ ♦ తఱిని లేచి
కృష్ణవీక్షణదీక్షనుఁ ♦ గీలుఁదప్పి
పడినబొమ్మనఁ జెంగల్వ ♦ పాన్పుఁబడియె. 92

వ॥ నాటిదినంబున భీష్మకభూపాలుండు బంధుమిత్రపరివార ముంగూడి యనుంగు గూతురగు రుక్మిణీదేవి వివాహ మహోత్సవకాలంబు సమీపించుటం జేసి నిఖిలధరామం డలాధిపతుల నాహ్వానంబుఁజేయందగు రాజబంధువ్రజ నియోగించి, 93

సీ॥ ప్రతివీథిలోన రం ♦ భాస్తంభముల నిల్పి
పచ్చతోరణములఁ ♦ బర్వఁజేసి
ప్రతిగృహాంగణమందుఁ ♦ బరిమళ సంయుక్త
మగుపుష్పహారము ♦ లమరఁగట్టి
ప్రతివేది మౌక్తిక ♦ ప్రతతిచే బహుచిత్ర
రంగవల్లులుఁ దీర్చి ♦ రమణమీఱ
ప్రతిరాజమార్గ స ♦ త్ప్రాకారముల దీప
కాంతులఁ జిత్రమై ♦ ఖరులఁగూర్చి

గీ॥ పురమునంతయు వైకుంఠ ♦ పురముగాఁగ
వనములన్నియు నందన ♦ వనములనఁగ

సురపురంబున మించిన ♦ సిరులతోడ
నలరఁజేసిరి కుండిన ♦ మనెడిపురము. 94

మ॥ భూమీశుండువసించు మేడయునుసౌం ♦ పుల్ మీర నెంతేసిను
త్రామాగారమువోలె దివ్యగతులన్ ♦ శోభిల్లఁగాఁజేసి రా
భూమిన్ రుక్మిణిపెండ్లిఁజూడఁగమహా ♦ పూజ్యంబుగాభూతల
స్వాముల్ బంధులఁగూడివచ్చిరెలమిన్ ♦ సంతోషహృద్భాసులై

వ॥ ఇవ్విధంబున జతురంగబలసమేతులై బంధుమిత్రపరివారంబులఁ గూడుకొని బఱతెంచినరాజేంద్రుల నారాజచంద్రుండన్నివిధముల సత్కరించి రుచిరభోజనాంబర దివ్యభూషణంబులొసంగి విడిదలకై నియమించిన మేలుభవనంబుల నుండంజేయ నంతనచ్చట చేదిదేశాధీశుండైన శిశుపాలుండు వివాహశుభలేఖనుఁ బరిగ్రహించి సంతసించి యాలేఖావహునికి వలయుధనంబులొసంగి. 96

ఉ॥ అంతటవానివీడ్కొలిపి ♦ యాప్తులుబంధులుమంత్రులున్ మహీ
కాంతులుసంతసింప శుభ ♦ కార్యము వారికెఱుంగఁజేసి వీ
డంతయలంకరించి పుర ♦ మంతయుఁ బౌరులుసంతసింపఁజే
మంతులగ్రుచ్చితోరణపు ♦ మాలలఁగట్టెపురంబునంతయున్

వ॥ అంత శిశుపాలుండు మహోల్లాసంబున బంధుమిత్ర



కృతిభర్త: శ్రీగోరంట వేంకట నరసింగరావు సర్దేశాయి
లింగన్నపేట సంస్థానాధిపతి.

## కృతిపతివంశావతరణము

క॥ గోరెంటవంశమందున
వీరయరేచర్లగోత్ర ♦ విహితాంశుండై
ధీరుఁడగు సింగరాడ్వరుఁ
డారయజన్మించెఁగాపు ♦ లందునఁగీర్తిన్. 27

క॥ కాపయి ధర్మగుణంబుల
ప్రాపయి మరిగోనెకాపు ♦ వారలకుమఁదా
దాపయి జననీజనకులఁ
గాపాడుచునుండె సుజన ♦ గణ్యాత్ముఁడై. 28

చ॥ అనఘుఁడు సింగరాడ్వరుఁడు ♦ దంచితలీలఁగృషీవలత్వమే
ఘనమనిమద్దిపల్లెయను ♦ గ్రామపుఁబ్రాగ్దిశలోవెలుంగఁగాఁ
జనియటఁదల్లిఁదండ్రులకు ♦ సమ్మదమొందహాలంబుఁబూనిజీ
వనమునకూతగాఁగొనుచు ♦ వర్ధిలుచుండెఫలింపసస్యముల్.

ఉ॥ మాతులపుత్రికామణిని ♦ మాన్యచరిత్రనువీరమాంబనున్
ఖ్యాతిగఁదెచ్చిపుత్రికకు ♦ గౌరవనీయులు తల్లిదండ్రులున్
బ్రీతిగఁబెండ్లిఁజేయనతి ♦ ప్రేమనువారుఁజెలంగుచుండ శ్రీ
కాంతుఁగృపాకటాక్షమున ♦ గల్గెనుపుత్రుఁడువారికంతటన్.

చ॥ తనయునిగాంచిమోదమునధన్యులుసింగయవీరమాంబలున్

బనివడిబంధుజాలమును ♦ బ్రాహ్మణవర్గముఁజేరిభక్తి భో
జనసుమగంధవస్త్రముల♦సంతసమొందఁగఁదృప్తిఁజేసిఁయా
తనయుని కడ్డపేరిడిరి ♦ ధన్యత "అడ్డలరెడ్డి" నానిలన్,

చ॥ దినదినవర్ధమానముగ ♦ ధీరుఁడు 'అడ్డలరెడ్డి' భూములన్
బనివడివృద్ధిఁజేసిబలు ♦ పంటలనెక్కుడుగాఁగనెంతయున్
ధనమునుసేకరించె,తలి ♦ దండ్రిలలేమినిఁబాయఁజేయు నా
పనులననేకముల్ సుజన ♦ పద్ధతిఁజేయుఁదొడంగశాంతుఁడై.

క॥ ధైర్యమునకు గిరివరు గం
భీర్యమునకు జలధి జనమున ♦ భీముఁడు ఘనసౌం
దర్యమున మరుఁడు పరహిత
కార్యములకునాదధీచిఁ ♦ గాఁజోలుభువిన్. 33

వ॥ ఇట్లాతఁడు భాసమాన తేజోవిలాసుండై దనరార జననీజనకులు పుత్త్రునకు మాతులపుత్త్రికయగు లక్ష్మాంబనుఁ దెచ్చి పరిణయంబొనరింప నాసుచిరాంగి శ్వశ్రూగృహంబున వర్ధిల్లుతరి.

చ॥ తనరెడి భర్తృనాజ్ఞజవ ♦ దాటకబంధులఁగాంచి నంత నే
వినయముఁజూపుచున్ సుమతిఁ♦బెద్దలుదన్నలరారుప్రేమతో
గనుచుముదంబుఁజూపవతి ♦ కాంతనుపుట్టినమెట్టినింటికిన్
ఘనమగుకీర్తిఁదెచ్చెనిజ ♦ కాపురమందునభాసమానయై.

వ॥ ఇట్లాదంపతు లిరువురు (శ్రీ)హరికరుణాకటాక్షమున సంసారంబెంతయో౯ బచ్చగాదనరఁగాపురంబుఁ జేయుచుండ నొండొకదినసంబున,

సీ॥ అంతట గోల్కొండ ♦ కధిపుంఢునిజరాజ
ధానిలోఁజేరిన ♦ స్థలములంగు
జంతుసంకలితమై ♦ జనుమార్గమునులేక
ఐపినప్రదేశమై ♦ వెలయుచుండఁ
బ్రజలెవ్వరేనియూ ♦ పరిగణంబులగ్రామ
నిర్మాణముం జేయ ♦ నిచ్చయున్న
నా దేశములవారి ♦ కధికారమొసఁగియు
భవ్య "జమీందారి" ♦ పదవులొసఁగ

గీ॥ దంచు "ఫర్మాను" నలుబ్రక్క ♦ లంపినంత
అడ్డరాడ్వరుఁడదిఁగాంచి ♦ యలరి సుజను
బొప్పనామకహాళిక ♦ భూరిధైర్యుఁ
గొరటుగొల్లనితో భాగ్య ♦ పురికినేగె.                35

వ॥ ఇట్లుజనిగి.

ఉ॥ ధీరులు పన్నుతింపఁగల ♦ దిట్టతనంబున రాజధానిలోఁ
జేరియతిప్రయాసమున ♦ స్నేహముఁగూర్చుక రాజకీయ "స
ర్దారుల" మెప్పులన్ వడసి ♦ తానటవచ్చిన కారణంబు న

వ్వారికెఱుంగఁజేయఁగను ♦ వారప్పుడిట్లు బెగించిరెంతయున్

శా॥ ధరవరవంశపావన సు ♦ ధాకర! యిచ్చటి కుత్తరంబునన్
వరలెడి రాచవర్లమను ♦ వన్యప్రదేశమునందుజంతు సం
చరణమెగాని మానవుల ♦ సాధ్యముగాదదిఁగానఁగోరినన్
విరివిగనీకొసంగెదము ♦ వేగమెచూచియురమ్ము పొమ్మికన్

వ॥ అనుప్రభుత్వాధికారుల నాజ్ఞను శిరసావహించి కొరటబొప్పన్నలందోడ్కొని నింకయుఁ గొందరు రాజభటుల సహాయముంగొని కొలఁది కాలంబునకా వన్యప్రదేశమునకుం జేరి.

చ॥ అటఁబోడఁగాంచె రెడ్డికులుఁ ♦ డంబరచుంబితమైనవృక్షముల్
పటుతరసింహవ్యాఘ్రములుభల్లుకమత్తమదేభలోకముల్
చటులవిషాగ్నిఁగ్రక్కెడివి ♦ సర్పములన్ బలుపక్షివర్గమున్
దిటువగుపర్వతంబులును ♦ దీవ్రతఁబాఱునదీనదంబులున్.

వ॥ ఇటులావిపినప్రదేశము నానాజంతు సంకలితమై యుంటంగాంచి యారెడ్డిరాసుతుండు తనమనంబున నిట్లు వితర్కింపందొడంగె.

క॥ మృగములు తిరుగఁదొడంగెను
పగలే చీకట్లుఁగ్రమ్మఁ ♦ బాదపచయముల్
జగిబిగి నలరారెడు, న

ప్పగదిని సఫలంబుఁగాంతు ♦ వాంఛితమిలలో. 39

క॥ అనియిటులఁగాపు కులజుఁడు
మనమునఁదలఁబోసి విఫల ♦ మానసయుతుఁడై
జని నిజపురమున కటగృహ
మునఁగల పనులన్నిమాని ♦ బొక్కుచు నుండెన్. 40

వ॥ ఇట్లు అడ్డలరెడ్డి పెన్నిధిపోయిన పేదచందంబున విగతధైర్యుండయి విచారంబుననుండ తద్ధాంగి లక్ష్మిబాయి భర్తపాదంబులకు వందనంబులాచరించి యిట్లనియె.

శా॥ స్వామీ! యేలవిచారచిత్తమునని ♦ స్వాస్థ్యంబు సస్వార్థమై
భూముల్ దున్నక, భార్యనై పదములన్ బూజించుచున్ గూర్చియే
ప్రేమన్ జూపక బీరుపోవుటదియే ♦ వీర్యంబు ప్రాణేశ! మీ
కీమార్గంబు ఘటిల్లుచింతనమునే ♦ దే నాకుఁదెల్పంగదే!

క॥ అనికోరియడుగు సతిఁగని
కనికరమునఁజేరఁ దీసి ♦ కరుణించియు నో
వనజాక్షి వనముఁజూడఁగ
ఘనమ్ముగ సంకలితమెటులఁ ♦ గావింతుఁబురిన్. 42

వ॥ అని గతంబుఁగానకఁ జింతిం చెదననిన యాసుగుణవతి.

సీ॥ తక్షణము, యేగిమీరలా ♦ ధాత్రిపతికి
నరయఁగానుకల్గొనఁగి మీ ♦ యభిమతంబు

నెఱుఁగఁజేసిన నధికార ♦ మిచ్చె నేని
గలఁడుమనపాలదైవంబు ♦ కరుణామయుఁడు. 43

చ॥ అతఁడటసంతసించియుని ♦ జాంగనమాటలమెచ్చుకొంచున
మృతమునస్యాలకుల్ సుజనమాన్యుల'నాగన'బొప్పనాఖ్యులన్
జతురతగొల్లఁడొ'కొరటు' ♦ సత్వరఁదోడ్కొనిగోలకొండభూ
పతినటఁగాంచిభక్తిమెయి ♦ భద్రతలక్షువరాలొసంగినన్.

వ॥ పాదుషాగారా కాన్కలందుకొని సుప్రీహృదయుఁడగు అడ్డలరాడ్వరుని సుగుణస్వభావమున కెంతయుసంతసించి చిరాయువుగ నాశీర్వదించి యిట్లనియె.

చ॥ ఘనమతినీయభీష్టమును ♦ గాదనిపల్కఁగ లేనుఁగాన బ
ల్చనవునసంతసించిమదిఁ ♦ జయ్యనినీకిదెయాజ్ఞపత్రమున్
పనివడినిచ్చువాఁడఁగొను ♦ పార్థివ! నావచనంబమోఘమై
దనరెడిరాచవర్గము స ♦ దాపరిపాలనఁజేయుమిమ్మహిన్.

వ॥ అనిమంగళాశీర్వచనంబులతో నాజ్ఞాపత్రంబొసంగ అడ్డలరెడ్డి నిజసతికి జయప్రదమగు వార్తనుం దెలియఁజేయనా నిమలాంగెంతయు సాతసించి బంధుమిత్రపరివార పురజన సహితంబుగా పదిరెండువందల మనుష్యులందోడ్కొని కొలఁది కాలంబునకు గోల్కొండపురంబునకుఁ జనుదేర అడ్డలరెడ్డి పాదుషాగారి సెలవుఁగైకొని ప్రభుపంపున శతసంఖ్యాపరిమితమగు భటులందోడ్కొని రాచవర్లకుంజని.

గీ॥ జలముచేరువ పెద్దదా ♦ స్థలముగాంచి
యందునందరు వసియింప ♦ ననువుగాఁగ
పాకలొకకొన్ని నిర్మించి ♦ భద్రమతిని
గట్టినచ్చోట పనునైదు ♦ గ్రామములను. 46

సీ॥ కోవిదనుతకైటన ♦ గోరెంటవంశంబుఁ
బరముగాగోరెంట ♦ పురమునొకటి
జనకుపేరటనొక్క ♦ చక్కనిగ్రామంబు
సింగపురంబునాఁ ♦ జెల్వనొందఁ
దరుణిపేరటలచ్చి ♦ పురమునావెలయించి
మేనమామలపేర ♦ మించిదసరు
వీరన్నపల్లి నా ♦ వెలయించి లింగన్న
పేరట లింగన్న ♦ యూరునొకటి

గీ॥ మరియు స్వగ్రామమగుమద్ది ♦ మళ్ళనాగ
యూరునొక్కటిగొల్లని ♦ పేరనొకటి
బొప్పపురమునుఁ గోరట్ల ♦ పురమునొకటి
గట్టఁజేసెను సుజనులు ♦ గణుతిసేయ. 47

సీ॥ మఱిఁదులపేరటఁ ♦ బరగుచుండగ గుండ
వరమొందుమరి సోమ ♦ వరముపేట
శ్రీనివాసపురంబుఁ ♦ జెలఁగిరామానుజ

పురముసర్వాయము ♦ న్పురమునొకటి
నాఁగమ్మపేటయు ♦ నవ్యతగజసిఁగ
వరమునాఁజెల్వొందు ♦ పురమునొందు
రమ్యతఁజిత్రించి ♦ గ్రామాధికారుల
నెలకొల్పియులమీఁద ♦ నీటినసతి

గీ॥ జనుల కనుకూలముగుసిఁగ ♦ సంక్రమ నెడి
వరతటాకము నిర్మించి ♦ ప్రజలఁగన్న
బిడ్డలనఁగూర్మిఁబ్రోచుచుఁ ♦ బేర్మితోడఁ
బాలనముఁజేయుచుండెనా ♦ పార్థివుండు. 48

గీ॥ అన్నపాలుఁడు నిజభార్య ♦ యందుసుతుని
మల్లనార్యునిఁగాంచి సం ♦ థిల్లి బ్రేమ
విమలగుణగణ్య రుచిరాంగి ♦ వేంకమాంబ
బ్రీతిఁగనుఁదెచ్చి సుతునకుఁ ♦ బెండ్లిజేసె. 49

శా॥ మల్లారెడ్డియఖండకీర్తిఘనుఁడై ♦ మారెందులేకుండఁ దా
నుల్లాసంబున రాజ్యభారమను శ్రీ ♦ లొప్పారఁగాఁదాల్చి శ్రీ
ఫుల్లాబ్జాక్షపదారవిందయుగళీ ♦ పూజాత్ముఁడై ధీరుఁడై
మల్లారెడ్డిపురంబు వేరొకటి ని ♦ ర్మాణంబుఁ గావించినన్

మ॥ ప్రజ తెల్లన్ నుహియుంపధర్మపరుఁడై ♦ పాలించుమల్లాఖ్యభూ
భుజుఁడానాఁదము జెందుచున్ సుమతుఁడై పాల్పొందరం గేశుఁడై

ద్విజులెల్లఁ ముదమొంద వేంకటపతీ ♦ దేవేశుకై భక్తితోఁ
రజితాకారతఁ గట్టె దేవళములన్ ♦ రమ్యార్థిఁ బృథ్విలో.

ఉ॥ ఆజననాథయోధమణి ♦ యందుదయించిరి మాచగంగరా
డ్భూజితులున్ దుదిన్ సుగుణ♦పూర్ణుని యెల్లయనాగముప్వురున్
భోజునివిక్రమంబలర ♦ బుద్ధివిశారద మూర్తిమంతులై
రాజకుమారులా దివిజ ♦ రాజ సమానులుగాఁగ వర్ధిలన్. 52

క॥ అగణితవైభవయుతులై
ముగురున్ దమపేరఁ జెలఁగు ♦ మహాపురంబుల్
సొగసుగఁ గట్టిరి వేల్పుల
నగరంబులమించినట్టి ♦ నగరవరంబుల్. 54

చ॥ అరయఁగ మాచరాడ్వరుని♦కంతట పుత్రద్వయంబుఁ గల్గెనా
ధరవరుఁ డప్పుత్రులకు ♦ ధర్మయమల్లయనాఁగ బేరులన్
వరలఁగఁ జేయువారలును ♦ వర్ధిలి కీర్తి వహింపఁ బేర్మితో
స్థిరమతి రాజ్యభారమును♦ జ్యేష్ఠునిపై నిడియుండెవాయిఁగన్

గీ॥ ధర్మరెడ్డియుఁ బ్రజలకుఁ ♦ దాడిప్రవోలె
పాలనముఁ జేసి తనపేరఁ ♦ బరగనొండు
ధర్మసాగరపురమును ♦ ధాత్రిలోన
గట్టె మాండవ్యనదికినిఁ ♦ గాలువలను. 55

సీ॥ ధర్మరాడ్వరుప్రియమైన ♦ తనయుఁడంత

హేమరెడ్డియుఁజెల్వొందు ♦ స్వామికృపను
నిఖిలవిద్యలనలరారి ♦ నియతిరాజ్య
పాలనముఁజేసెధర్మప్ర ♦ వర్తనమున. 56

వ॥ అంతనాతఁడు.

సీ॥ ప్రాతవడిజీర్ణమౌ 'సనద్' ♦ భద్రపరచి
పాదుషాఁజేరికానుకల్ ♦ భక్తినొసఁగి
క్రొత్తయధికారపత్రముఁ ♦ గోరియడుగ
సంతసమునొంది రారాజు ♦ 'సనదు' నొసఁగె. 57

సీ॥ అటులనొసఁగుటఁయోఁగాక ♦ యాధిపత్య
పదవిదశబంధమలరారు ♦ పదవిమరియు
దేశముఖయును దేశాయి ♦ దేశపాండ్య
పదవులవియెన్నియోనిచ్చి ♦ పంపెనతని. 58

క॥ ఘనుఁడగుప్రపితామహుచే
మనమలరఁగనిర్మింపఁబడిన ♦ మల్లాపురికిన్
జని, యుత్తరకాలంబట
వినజాతునిఁగొలచిపరమ ♦ పదవిఁబొందెన్. 59

ఉ॥ అంతటగంగరాట్తనయు ♦ లక్కనదమ్మనరాజ్యభారముల్
బంతమెలర్పఁబూని పురి ♦ పాలనజేయుచు ధర్మపద్ధతిన్
వంతలఁ జిక్కకుండసుఖ ♦ వంతులుగాబ్రజరక్షఁ జేయుచున్

చింతనఁజేయుధీరులయి ♦ చెన్నువహించిరి కీర్తికాములై.

గీ॥ మల్లరెడ్డికి మూడవ ♦ మాన్యసుతుఁడు
పాలనముఁజేసి తనపేరఁ♦ బరగనొకటి
ఎల్లరెడ్డిపేటయనొక ♦ యేర్పరించి
కాంచెనంతట నొకపుత్రుఁ ♦ గాంచనాంగు 61

వ॥ అంతనాతనిసుతుఁడు.

గీ॥ భోజరాజనుపేరట ♦ బుధులునొగడఁ
రాజ్యభారము ధరియించి ♦ రమ్యమతుఁడు
కన్నతండ్రికి యశమునుఁ ♦ గలుగఁజేసి
ప్రజలఁబాలించుచుండెనా ♦ భద్రగుణుఁడు 62

ఉ॥ దానముధర్మముల్ గుణము ♦ దారతశాంతియుఁగల్గిభక్తిచే
దానవవైరికీర్తనలు ♦ ధన్యతఁజేయుచు రాజ్యభారముల్
బూని మనోజ్ఞజవ్వనముఁ ♦ బొఁపరివోవ వివేకసంపదల్
భూనుతుఁడయ్యెభోజుఁడల♦భోజునిమించిప్రభుత్వమందునల్

ఉ॥ భూనుతవైభవస్ఫురణఁ ♦ బూజ్యతగాంచియుభోజరాజుతా
సూనులులేని తద్గతికి ♦ శోకభరుండయి కుంది శ్రీహరి
ధ్యానపరుండునైవిషయ ♦ దగ్ధుఁడుఁగాకపవిత్రమూర్తియై
శ్రీనలినాక్షుజింతనముఁ ♦ జేయుచుజన్మతరించె నంతటల్.

గీ॥ గంగరాడ్వరసుతుఁడు వి ♦ ఖ్యాతిఁబ్రబ్ధిఁ

పాలనముఁ జేసి ధర్మసం ♦ పన్నుఁడగుచుఁ
జేర్మిఁదన పేరదమ్మన్న ♦ పేటనొకటి
గట్టెఁదనకీర్తి ద్విగుణమై ♦ గ్రాలదిశల. 65

సీ॥ ఘనుఁడునాతని భ్రాత యు ♦ కృష్ణ నృపుఁడు
తనదు పేరట నొకయూరు ♦ దనరఁజేసి
ఖ్యాతి వర్ధిల్లి(శ్రీ)హరి ♦ కరుణవలన
సుతులనిర్వురఁగాంచెఁ గి ♦ శోర బలుల 66

ఉ॥ రాయనలింగ నాఖ్యలను ♦ రంజిలువారలలోఁ గనిష్టుఁడో
ధీయుతుఁడైన లింగనను ♦ ధీమతుఁడంతట లింగపల్లియో
రా,యసమాన తేజుఁడట♦నందముతోఁడుతఁగట్టె జ్యేష్ఠుఁడో
రాయనరాజ్యభారమతి♦ రమ్యతదాల్చుచునేలుచుండఁగన్

ఉ॥ మందరగోత్రధీరుఁడభి♦ మానధనుండగుఁబుత్రునొండుసం
క్రందన వైభవంబునను ♦ వర్ధిలఁగాంచెను కాంచివానికిన్
బొందుగ రాజ్యమున్నొసఁగె, ♦ భూవిభులింగనపాలనంబునే
మందునురామరాజ్యమన ♦ నంతటధర్మమునిండివెల్లగన్.

సీ॥ శుభముహూర్తమునందున ♦ సుతునినొకనిఁ
గాంచి చినరాయఁడనపేరఁ గ్రాలఁజేసి
తనరఁబట్టముఁగట్టియు ♦ ధాత్రివిభుఁడు
హరినిస్మరియించి పరలోక ♦ మతఁడుఁజేరె. 69

గీ॥ చిన్నరాయన్నభక్తుఁడై ♦ చెన్నుమీఱి
తండ్రికట్టినగుడిలోనఁ ♦ దానుదివ్య
మంటపంబొండు ద్వాదశ ♦ మహితజ్యోతి
లింగసంస్థాపనముఁజేసె ♦ రంగుమీఱి. 70

గీ॥ అతనిపుత్రుండు రాజన్న ♦ క్షితివరుండు
తనకుసంతానమును లేమి ♦ దత్తుకొకని
రమణచేకొనె రాయనన్ రాజసుతుని,
హరినిస్మరియించిపరలోక ♦ మతఁడుజేరె. 71

ఉ॥ రాయన కొంతకాలమట ♦ రాజ్యముసేసి దివంబుఁజేరఁగా
నాయన ధర్మపత్నిసుగు ♦ ణాకర నర్సమరాజ్యభారమున్
ధీయుతఁదాల్చిపౌరులను ♦ ధీమతిబ్రోచుచుదత్తుఁజేకొనెన్
గాయజుగేరుసుందరునిగంగయరాట్కులపుత్రునొక్కనిన్

శా॥ ఆరాజన్యుఁడురాజ్యమేలుతరిలే ♦ రైరందుభిక్షాటులున్
జారుల్ చోరులుమర్మదాంధకుమతుల్ ♦ సద్ధర్మదూరుల్ వృధా
పోరుల్ చేసెడి వారుదైవపదస ♦ త్పూజావిరక్తుల్ దురా
చారుల్ పుత్రవిహీనదుఃఖితులునాక్ష్మామండలిన్ జూడగన్

క॥ ఏయేవర్ణాశ్రమజను
లాయాపద్ధతులనడచు ♦ నట్టులవారిన్
బాయకశాసించుచునృపుఁ
డేయుటమటయు లేకపృథ్వి ♦ నేలుచునుండెన్. 74

క॥ ఆనరనాథుఁడు పిమ్మట
జానకినాఁబరగునొక్క ♦ చక్కని కన్యన్
మానుగఁ బెండిలిఁ జేసుక
తానటు వర్ధిల్లుచుండు ♦ తరుణములోనన్. 75

సీ॥ చెన్నమన్నని 'సిరిశిల' ♦ క్షితివరుండు
గలఁడుక్ర్వారుఁడు నిరతంబు ♦ కయ్యమూని
గంగనృపుతోడ, సైన్యసం ♦ కలితుఁడగుచుఁ
బోరుచుండెను భూములఁ ♦ బొందఁదలఁచి. 76

చ॥ పలుమరుయుద్ధకాంక్షఁగొని ప్రౌఢిని వచ్చిన చెన్నమన్ననున్
వెలమదొరన్ బరాభవము ♦ వేమరుఁ జేయుచు గంగరాజు తా
జలమున దేజరిల్లఁగను ♦ చయ్యన నాతఁడుఁ బోరలేక దు
ర్బలమతుఁడయ్యు నేగె నిజ ♦ పట్టణకఁ జచ్చినవానిభంగిగాన్.

న॥ అట్లు జనివిగతధైర్యుండై నిజసైన్యంబునంగల ప్రవీణులగు కొందరిని రావించి మీరుపచ్ఛన్నవేషంబుల గంగరాజునాశ్రయించి యుద్ధకౌశలతఁగనబరచి నాతనికొలువుననుండుడు. మేముదండెత్తి వచ్చినప్పుడు వలయుసాయంబునుం జేసి మాలోఁజేగుఁడని పుత్తెంచిన, వారలువల్లెయని కొలదిదినంబులలో నాపృథ్వీవరుని రాజ్యంబునకుం జేరి గంగరాజుని సందర్శించి యిట్లనిరి.

చ॥ బ్రతుకఁదలంచిమీపద ♦ పంకజయుగ్మము జేరినాముమీ
కతులిత సంతసమ్మొదవు ♦ నట్టి పరాక్రమ యుద్ధనైపుణీ
చతురలమంచుఖడ్గములు ♦ చయ్యనఁద్రిప్పనృపుండు మెచ్చిన
మ్మతిఁదగు వేతనంబులును ♦ మందిరముల్ నొగినిచ్చెవారికిన్

చ॥ అనయముఁగ్రూరకర్ములగు ♦ నాకపటాత్ములవిశ్వసించియా
జనవరుఁడుండుటన్ దెలసి ♦ సత్వరమొక్కనిఁబంపి వెల్మరా
డ్జనవరు సైన్యయుక్తముగ ♦ జయ్యనఁదోడ్కొనివచ్చినట్లుఁగా
ననుచితరీతిఁ దెల్పఁగను ♦ నాతఁడుకోటను వీడిసత్వరన్.

చ॥ తలఁగకభీతి నొందకతి ♦ తామసుఁడామనుజుండుఁజేరి తా
వెలమకుఁదమ్మునేలుదార ♦ వీటికిఁబోయినెరుంగఁజేయమా
యలనటఁబన్ని సైన్యముసమాయతఁగూర్చుకనానృపుండుని
శ్చలముగఁగోటఁజేరఁగను ♦ సత్వరముఁదనవారలంతటన్.

సీ॥ కాంచియుత్తరద్వారమా ♦ కలుషమతులు
దెరువనంతలసిరిశిల్ల ♦ దొరయుభటులుఁ
గోటఁజొచ్చినఁదద్రక్ష ♦ కులును వారు
ఘోరయుద్ధంబుసల్పిరి ♦ కొంతదనుక. 81

చ॥ పగతునిసైన్యమావిధిని ♦ బారులు తీర్చిపోరఁగఁగంగరా
డ్జగపతి గానకుండనతి ♦ జాగ్రతఁదానట గోలకొండకున్
యగణితతీవ్రతన్ జనియు ♦ నచ్చటవారికెఱుంగఁజేయఁగా
జగపతిచేష్టలన్ వినుచు ♦ తన్మతలనాథుఁడుకోపదీప్తుఁడై

చ॥ అరయఁగ శత్రుభీకరుల ♦ నంతటఁ జాయ మొసంగి గంగరా
డ్వరుగుణ మెంతయుం బొగడి ♦ వైరుల నిప్పుడు జయించి వేగమే
నెరుఁగఁగఁ జేయుమా విసఁగ ♦ నెంచితి నీదు ప్రభుత్వ మెంతయో
బరమపుకీర్తి నీయమద ♦ భవ్యులుఁ గారె త్వదీయ వంశజుల్.

గీ॥ ధర్మగంభీర బిరుదులు ♦ ధరవరేణ్యా!
నీకు నొసఁగితి వర్ధిల్లు ♦ నీవు మాకు
నాత్మబంధుఁడవై కీర్తి ♦ నంది పృథ్విఁ
బాలనము సేయు ధర్మసం ♦ పన్నమతిని. 88

చ॥ అని యిటు లాదరింప విన ♦ యంబున నాతఁడు నాజ్ఞఁ బొంది స
జ్జనము తురాయ సబ్బులను ♦ సత్వరఁ దోడ్కొని పోయి వేగమే
యని నట ఖండఖండముగ ♦ నందరి నిన్ దెగటార్చి ధీరుఁడై
జనపతి కీర్తివంతుఁడయి ♦ సౌఖ్యకరంబుగ పృథ్వి నేలఁగన్.

గీ॥ అట్లు జగపతి పరిభవ ♦ మంది, లింగ
రాయుఁడను శూరుఁ బిలిపించి ♦ రయముగాను
మేటి మగలగు వీరుల ♦ మించి నొసఁగి
ధర్మగంభీర దేశాయి ♦ ధాత్రివరునిఁ
బోరి జయమొందితేని యా ♦ యూరసగము
నీకు నొసఁగెదఁ బొమ్మన్న ♦ నెమ్మి నతఁడుఁ
నాసఁగొని సప్తదినముల ♦ వతఁడు పోరి

సైన్యముఁబుఁగూల జవమున ♦ సన్నగిల్ల
భీతిఁబాఱంగ వెన్నాడి ♦ బిట్టునగుచు
వానిఁజంపియుఁగోటవాగఁ ♦ బాఱవేయ
భువిని "లింగన్నఁదలఁగొట్టు ♦ బొంద" యనఁగఁ
బ్రబలమయ్యెను నిప్పటి ♦ నరకుఁగూడ. 85

వ॥ ఇట్లు జయంబుఁగాంచి గంగరాడ్వరుఁడు గోలకొండపాదుషాగారిచే "ధర్మగంభీరరావ" నను బిరుదంబునందిదుష్టుల శిక్షించుచు శిష్టులరక్షించుచు ధర్మంబు నాల్గుపాదంబులనడపించుచు రాజ్యపాలనంబుఁ జేయుచుండెను.

సీ॥ వేంకటాద్రియు లింగన్న ♦ పేటలనఁగను
కోకటిగాఁజేసి రమణీయ ♦ మొప్పఁగాను
ధర్మగంభీరపేటనా ♦ ధరణివెలుఁగఁ
జేసినారాజుగుణములఁ ♦ జెప్పఁదరమె. 86

వ॥ అంతఁగొండొక కాలంబునకు.

క॥ జనపతి దివమునకరిగిన
జననాయకుభార్యయైన ♦ జానకిరాజ్యం
బనయముఁగాపాడుచుఁదా
జనులను రక్షింపఁదొడఁగె ♦ తన్మతిలోనన్. 87

ఉ॥ ఆయసమచిత్తవృత్తి వినయంబునపృథ్విభరించుమార్గమున్

బాయని రాచబుద్ధిపరి ♦ పాలనఁ జేయుక్రమంబుఁ గాంచియా
కాయజుతల్లియో శివుని ♦ కాంతయొ భారతియో యటంచు నా
ధీయుతజానకాంబ సర ♦ దేశముఁ బోల్తురు లోకు లెప్పుడున్ ॥

సీ॥ ఆపె యొకనాఁడు కాపువా ♦ డర్భకుండు
గోవులను గాచునాతనిఁ ♦ గొడుకువోలె
పెంచి పెద్దఁగ జేసి యా ♦ పిదపవాని
యాధిపత్యంబునొసఁగి తా ♦ నరిగె దివికి 89

వ॥ అతఁడు ధర్మగంభీరరావనం బరగు.

గీ॥ ధర్మగంభీర రావంతఁ ♦ దల్లిమార్గ
మనుసరించుచుఁ బురినేలు ♦ ఖ్యాతిఁ గనుచుఁ
గూర్మి పాపమ్మయనియెడి ♦ కువలయాక్షిఁ
బ్రేమఁ బెండిలియాడి సం ♦ ప్రీతినుండె. 90

సీ॥ ఆమహాభాగ్యరాసి తా ♦ నధిపువలనఁ
సుతునొక్కనిఁ గాంచె వి ♦ ఖ్యాతిఁ బిదప
సంతతియులేక నరహరి ♦ సంస్మరించి
వరముఁ గాంచెను పిమ్మట ♦ పార్థివుండు॥ 91

కం॥ బాలక్కయనెడి కన్యను
లీలన్ దగఁ బెండ్లియాడి కు ♦ లీను సుపుత్రున్
శీలున్ నరసింగ్రావను
బాలున్ నటఁ గాంచె గనుల ♦ పండువగాగన్. 92

ఉ॥ అంతటనాకుమారుఁడుజ ♦ యంతవసంతులమించికామినీ
కాంతునివోలెనివ్వటిల ♦ క్ష్మాతలనాథుఁడుజాతకర్మముల్
సంతసమొందఁజేసి బుధ ♦ సంతతిబంధులకొక్కనాఁడు వే
వింతగుపిండివంటలను ♦ విందులతాఁబచరించె నెంతయున్.

వ॥ ఇటులఁగొన్నిదినంబులు గడువ.

గీ॥ అంతబాలకృ మ్మతినొంది ♦ నంత నృపుఁడు
వేంకమాంబనుఁబెండ్లాడి ♦ వేడ్కమీరి
యాతలోదరియందున ♦ నతఁడుఁగాంచె
ముగురుఁబుత్రుల మన్మథ ♦ మూర్తులనఁగ　　94

క॥ ధరలక్ష్మణరావును భూ
వరు వేంకట కృష్ణరావు ♦ నరలఁగరా జే
శ్వర రావు తృతీయుఁడునా
వరలుచు సద్గుణులు ధృతి వి ♦ భాసితులగుచున్.　　95

వ॥ దినదినప్రవర్ధమానులై యొప్పారుచుండ.

క॥ ధరరెండవభార్యకునా
నరవరునకుఁబుట్టినట్టి ♦ నరసింగా వా
ధరణీతలి కధిపతియై
పరిపాలనసేయఁదొడఁగ ♦ ప్రజలిలమెచ్చన్.　　96

వ॥ అంతనారాజన్యుఁడు.

క॥ ఎడవడియనుగ్రామముఁ
గడువడిఁబాలించుప్రభుని ♦ గావలికూతుర్
వడిరాజమాంబకన్యను
బుడమీశుఁడుపెండ్లియాడె ♦ పూతచరిత్రన్. 97

క॥ సంతాన ప్రాప్తి లేమినిఁ
జింతించియు నృపుఁడు మిగుల ♦ జింతాస్పదుఁడై
పంతంబున పాపమ్మను
కాంతను వరియించె మేలు ♦ కన్నియఁబ్రీతిన్. 98

క॥ ఇరువురుభార్యలు ♦ గలిగియు
ధరణీశ్వరుఁడంతపుత్ర ♦ దశఁగానకఁదాఁ
బరిపరిచింతలఁజిక్కియు
హరిఁజేరె తదంఘ్రియుగ్మ ♦ మాత్మనుగనుచున్ 99

ఉ॥ ఆజననాథుభార్య సుగు ♦ ణాంచితధర్మ ప్రవర్తనంబుచే
రాజిలఁగీర్తిఁగాంచి పెర ♦ రాజులగుండెలు దద్దరిల్లఁగా
రాజితరాజ్యమేలినిజ ♦ రాజ్యమునందునఁ బౌరులందు న
వ్యాజితప్రీతిఁజూపిబుధ ♦ వర్ణనకెక్కెను రాజమాంబిలన్.

క॥ తనరాజ్యప్రతినిధిగా
నొనరిచెనరసింగరాయ ♦ నుర్వీసురునిన్
వినయంబుతోడనాతఁడు
జనులకు సౌఖ్యంబుఁగూర్చ ♦ సాగనుప్రీతిన్. 101

గీ॥ భామినీమణియొకనాఁడు ♦ భాగ్యనగర
పాలనాధీశు నుద్యోగు ♦ భవ్య రాజ
యింద్రజిత్తును జూడంగ ♦ నింతిపోవ
నతఁడుఁగూర్చుండ నియమించె ♦ సర్వపీఠి. 102

గీ॥ అంత మానకొండూరన ♦ కధిపుఁడైన
సాంబశివరావుకూడన ♦ చ్చటకివచ్చి
రాజబాయగ్రపీఠి వి ♦ రాజిలఁబోడ
గాంచియోర్వక నిటులదాఁ ♦ గారులఱచె. 103

గీ॥ భర్తృహీనవు నీవ్వని ♦ పగిదిమీరి
మానవతివయ్యుఁబురుషుని ♦ మాడ్కిసభను
దనరుపీఠంబుఁపుండుట ♦ తగవుఁగాదు
అంగనలకిట్టి స్వాతంత్ర్య ♦ మర్హమగునె! 104

వ॥ అనిన యావీరపత్ని.

గీ॥ కనులురక్తిమ మొందఁగ ♦ గనలిమిగుల
నార! దుర్మార్గ! కారుల ♦ నఱువఁబోకు
మూఢ నీకునుఁగాలమ్ముఁ ♦ మూర్ఖచిత్త!
మాకు మునుసేనఁ జేయుట ♦ మరచితౌర! 105

గీ॥ మానవాధమ! కాఱులు ♦ మానుమింక
నీదునాలుకనిప్పుడి ♦ నిముస మందుఁ.

మునియ తునియలఁ జేసెద ♦ తులవ! కాని
పరుని యిల్లగు కలసఁబో ♦ (బతికితీవు. 106

ఉ॥ ఓరి దురాత్మ! నీవు బుధ ♦ లొప్పని భంగి దురూక్తు లాడుటే
సారము! దుష్టవర్తనము ♦ సాధనమయ్యెడి నీప్రతాపముల్
ధీరత గర్వముల్ సణఁగఁ ♦ దీసియు నిన్నుఁ బరాభవంబు చేఁ
జారఁగఁ జేయుదానఁ గన ♦ వచ్చెదు నింతకు నోరి దుర్మతీ!

వ॥ అనిపలుకు రాజాబాయి దేశాయిగారి నవలోకించి సాంబశివరావు కోపోద్దీపితుండై యిట్లనియె.

చ॥ పడతిరో! యేలకో యిటుల ♦ బల్కెదు పెగ్గెలు నన్ను జంపఁగా
నడిదముఁ జేతనుంగలద ♦ టంచుఁ ద్వరల్ బడఁబోకు నేని దే
గడవు నొసంగువాఁడ రణ ♦ కౌతుకమయె నీకిలఁగల్లు నేని నీ
వడిఁగల తేజముం దోరఁగ ♦ వచ్చెద నీపురికింత లోపలన్.

ఆ॥ అనిన రాజమాంబ ♦ యధికరోషంబునఁ
గనలి వానిఁ జూచి ♦ కలుషమతుఁడ!
స్త్రీయ స్తోత్రమేల ♦ జేసెద ననిలోనఁ
గాంచుదాన నీదు ♦ ఘనతఁ బోర! 109

వ॥ అనియిట్లా రాజాబాయి దేశాయి కడుంగడు రోషకషాయిత నేత్రయై సాంబశివరావు దేశాయినిఁ దూలనాడి ప్రళయకాల మార్తాండ సదృశంబైన మోము నెఱ్ఱఁబార గిరుక్కున గద్దియఁ డిగ్గి నిజనివాసంబగు లింగన్న పేటకుం జనియె.

గీ॥ అంతశివరావు మనుకొండ ♦ కరిగిపిదపఁ
బదియుఁబండ్రెండు వేల రణ ♦ భటులఁగూడి
శతశతఘ్నులు గుఱ్ఱముల్ ♦ సమరవీథి
నడువనేతెంచె లింగన్న ♦ నగరమునకు. 110

వ॥ ఇట్లరుదెంచు పగతురసైన్యంబులను జూచివీరపత్నియగు
రాజాబాయి సర్దేశాయిగారు.

గీ॥ కోటమార్గములన్నియు ♦ మాటుఁజేసి
శతశతఘ్నుల బురుజులఁ ♦ జక్కనిలిపి
నేర్పుఁగలవీరులచ్చోట ♦ నిలువఁజేసి
కవచమునుఁదాల్చి చేఁబట్టి ♦ ఖడ్గమపుడు. 111

క॥ దురమున శివరావుఁగని
బరిమార్పఁగ దలఁచి వీర ♦ భామినిశౌర్య
స్ఫురణన్ గలచిత్తముతో
దరుణముగని వైరిదళముఁ ♦ దలఁగొనుచుండెన్ 112

చ॥ కురిపిరిలింగరాడ్పురవు ♦ గోపురమందలిమందుగుండులన్
ధరనటవైరిమూకయును ♦ దత్ప్రతితోపులుకోటమీఁదికిన్
బరపినలోనఁబోకఁబుడి ♦ బ్రక్కనఫీలులఁదాకి వ్యర్థమై
పరిఘములందెగోళములు ♦ భాసిలె తాళఫలంబులోయనన్

వ॥ అంతరాజాబాయి సర్దేశాయిగారు నిజసైన్యంబునుంజూచి
యిట్లనియె.

క॥ రణశూరుల లక్షణముల
దనకేమరగు రిపులబలము ♦ దర్పణమునఁగాన్
ఘనమైనకీర్తిగావున
వెనుకాడకపోరునువైరి ♦ వీరులనడఁచన్. 114

క॥ గురిదప్ప నీకశరములు
పరసైన్యమునీఁదఁగుప్పి ♦ పైబడివారిన్
నఱకుఁడుపొడుఁడటంచని
బురిఁగొల్పుచునుండెరావ్రి ♦ మూర్తియువోలెన్. 115

గీ॥ బలములన్నియునేకమై ♦ బడుచుఁబగతు
సైన్యమంతయుభిన్నమై ♦ సన్నగిలఁగ
హోరుగాఁబోరఁదొడఁగిరి ♦ వీరమాత
రాజబాయికిజయమంచు ♦ రణమునందు. 116

వ॥ అంతరాజాబాయి సద్దేశాయిగారు.

క॥ బలవంతులు నిజభటులటుఁ
దలఁబడఁబరసైన్యమున్ ♦ తత్తర మొందన్
గలఁబడిపోవుచునుండఁగ
నలివేణియునశ్వమెక్కి ♦ యతితీవ్రగతిన్. 117

వ॥ యుద్ధభూమినింబ్రవేసించి.

సీ॥ తనవారలకుసుధా ♦ ధామమైగన్పించు
బరులకుచండాంశుఁ ♦ బగదిఁదోఁచుఁ

దనసైన్యముంజూచు ♦ తఱిశాంతముంబాల్చిఁ
బగతులఁగనసగ్నిఁ ♦ బర్వసేయుఁ
నిజబలంబులకుఁదా ♦ నగడిధైర్యమునిచ్చు
బరులదిట్టతనవ్యర్థ ♦ పఱఁగఁజేయుఁ
దనచేతిఖడ్గంబుఁ ♦ దనవారిశానంద
భరితంబునొరులకు ♦ భయదమృత్యు
గీ॥ వనఁగరాజాంబ శౌర్యంబుఁ ♦ దనరయుద్ధ
భూమిమార్కొని వారల ♦ భూతతతికి
బలియొనర్చుచుఁగదనభూ ♦ భాగమందు
రమణిఁ దిరుగాడఁజొచ్చె మా ♦ ర్తాండుపగిది. 118

వ॥ సాంబశివరావు దేశాయి బలవంతులగు కొందఱువీరభటులను దోడ్కొని రాజాంబదేశాయి నెదిరించిపోరుచుండ,

మ॥ కనిరాజాంబయు భూరికోపమడరం ♦ గా శస్త్రసంపన్నయై
దనువుల్సించియుద్రుంచివైచిమిగులన్ దత్ఫాలదోర్ద్వంద్వలో
చనయుగ్మంబులబాణముల్ గుఱిచియా ♦ శ్చర్యంబుసంధిల్ల సిం
హనినాదంబొనరించెనిస్తులితశౌ ♦ ర్యాటోపముల్ జూపుచున్

క॥ పదునుఁజెడి సాంబశివుఁడును
మదితత్తరమొంది భీతి ♦ మాఱుకొనంగన్
బెదరియు మదిచెదరియుఁ
బదములకును బుద్ధిసెప్పి ♦ పఱుఁగిడఁజొచ్చెన్. 19

గీ॥ అపుడు రాజాంబ శీవ్రిత ♦ వరగి వానిఁ
బట్టికిందకుఁబడఁద్రోసి ♦ పాతుఁబోత!
ప్రాణభీతిని జీవముల్ ♦ పట్టిచేతఁ
జాతిపోవుటశౌర్య సం ♦ పన్నగుణమె! 120

గీ॥ మరచినాఁడవె యానాటి ♦ మాటలన్ని
యిప్పుడుఁజూపుము నీశక్తి ♦ చపలమతుఁడ!
శమనవీటికి నినుఁబంపు ♦ సమయమబ్బె
ననిననాతఁడు కేల్మోడ్చి ♦ ననియెనిటుల. 121

క॥ శరణంటిని కరుణించుము
చరణంబులఁబడినవానిఁ ♦ జంపుటతగువా!
వరవీరభామినీమణి
ధరననుఁ గరుణించిబ్రోవు ♦ తల్లీ! యనినన్ 122

వ॥ అనియిట్లు కాళ్ళంబడి దుఃఖంచెడిసాంబశివరావుదేశాయిని
కరుణించి.

చ॥ అలఘుదయాసముద్రయగు ♦ నాయమవ్వానిని లేవనెత్తి భీ
తిలనికనేలఁబొమ్మునృప ♦ తీరెను నాదుప్రతిజ్ఞ నింక నీ
బలమును శౌర్యముందరిగ ♦ భద్రితనీదగు నూరఁజేరి యీ
కలుషప్రవృత్తులన్ విడచి ♦ గౌరవరీతి మెలంగుబొమ్మికన్.

వ॥ అని సముచితరీతి నీతులంగరపి పరిహసించి విడువనాతఁడు
శివచ్ఛవంబుభాతి హతశేషమగు సైన్యంబునుందోడ్కొని

జనివాసంబగుమానుకొండూరుఁ జేరితనపరాభవంబున కింతయు
జింతించుచుఁ గుములుచు మాసత్రియములో విగత జీవుం
డయ్యెను. తదనంతరంబ,

క॥ తనతోఁడు బుట్టినట్టుల
ఘనతరముగ పాపమాంబ ♦ కాంతామణినిన్
గనుచున్ ముదమునఁదానట
మనమలరఁగ గ్రామమొకటి ♦ మాన్యతనొసఁగెన్. 124

గీ॥ పరగరాజేశ్వరుండనెడి ♦ బంధునొకని
దత్తుఁజేకొనిదొంతిసం ♦ స్థానరాచ
కన్యవేంకాంబఁదెచ్చియు ♦ ఘనముగాను
పెండిలినిఁజేసె రాజాంబ ♦ ప్రీతితోడ. 125

చ॥ సరసతవారలిర్వురును ♦ సంతతమోదముతోడ శ్రీహరీ
కరుణప్రసాదమున్ గనియుఁ♦గాంచిరిపుత్రుని,రూపసంపదా
కరమహనీయపెన్నిధిని ♦ గాంచినయంతటరాజదంపతుల్
హరిఁగననేగిరోయనఁగ♦ నమ్మహనీయులుపొందిరైక్యమున్

గీ॥ వారు హరిఁజేర దుఃఖసం ♦ ప్రాప్తమైన
చింతనలఁజిక్కి రాజాంబ ♦ చేరదివికి
నంతపాపాంబ యధికార ♦ మవ్వుడు బూని
మఱఁదిరెండవకొమరుని ♦ మానసిల్లుఁ

డైన వేంకటనరసింగ ♦ మనెడిబాలు
దత్తుఁజేకొని బుధులు సం ♦ తసమునొంద. 127

గీ॥ పాపమాంబయుఁ దోఁబుట్టు ♦ భవ్య లక్ష్మి
రాజరాయుని పుత్రియా ♦ రాజమాంబఁ
దెచ్చి నరసింగరావున ♦ కిచ్చి పెండ్లిఁ
జేసెనాయింతి వైభవ ♦ శ్రీలుఁ జెలఁగ. 128

గీ॥ కొంతకాలమున్నపుఁడు ప్ర ♦ శాంతముగను
గాలముంగడపి యటమీఁద ♦ క్ష్మావరేణ్యుఁ
డశ్వమున నుండిపడియుఁ దా ♦ నవశుఁడగుచు,
బరముఁ జెందెను వైకుంఠ ♦ ప్రాప్తుఁడగుచు. 129

గీ॥ పుత్రశోకంబునన్ బొక్కి ♦ పూతచరిత
పాపమాంబయు మృత్యువు ♦ వాతఁబడిన
రమణి నాయమ్మ కోడలౌ ♦ రాజమాంబ
కాధిపత్యంబు లబ్ధమై ♦ యలరెనంత. 130

గీ॥ భగినిపుత్రికపుత్రుగో ♦ పాలప్రభుని
వరలగంభీరదత్తునా ♦ బిరుదొసంగి
దత్తుఁగైకొని ముదమునఁ ♦ దనరుచుండు
నంతలోపల నారేడు ♦ వరగె దివికి. 131

వ॥ అంతలు రాజాబాయిదేశాయి మున్ముందు రాజ్యపరిపాల
నార్థమైన వంశోద్ధారకుండు లేమినిఁజింతించి,

ఉ॥ పంకజనేత్రి దత్తు వేరొకని ♦ భాసిలఁ జేకొననొచికోడలా
వేంకటలక్ష్మితో నడుగ ♦ వేడ్కతో నామెయు సమ్మతింపమీ
నాంకునిఁ గేరు సుందరును ♦ దాంచితసద్గుణపూర్ణుఁడౌ బుధుల్
వేంకటనారసింగనృప ♦ వీరుని రాజము దత్తుఁ జేకొనెన్. 132

వ॥ ఆనృపతనూజుని వంశక్రమంబెట్టిదనిన.

గీ॥ అటుకునూరువంశాబ్ధికి ♦ నలరఁ జేయు
ననఘుపాతూరి రామకృ ♦ ష్ణాఖ్యనృపుని
నయతి సూనుండు వేంకట ♦ నారసింగ
పృథ్వీభరణుండు విద్యాప్రి ♦ వీణుఁడరయ. 133

సీ॥ శాంతిచే నలరారి ♦ దాంతిచే ముదమొంది
తల్లిదండ్రులమాట ♦ దాటఁడెపుడు
పెద్దలఁగనుగొన్న ♦ ప్రీతి భక్తినిఁ జేరి
సేవలఁ జేయుచుఁ ♦ జెలఁగుచుండుఁ
బరులఁ గష్టింపంగ ♦ నెరిసాయముం జేసి
నాత్మ శ్రీహరిసేవ ♦ నలరుచుండు
విత్తాధికారత ♦ విజ్ఞవీగక నెపుడు
నింపుభావముతోడ ♦ నుండుజగతి 134

గీ॥ సకలసద్గుణసంపన్న ♦ చక్రవర్తి
రమణ వేంకటనరసింగ ♦ రాయనృపతి

యతనిగుణములునుతియింప ♦ నలవియగునె
నలువకైనను వేనోళ్ల ♦ చిలువకైన. 135

చ॥ సురుచిరమూర్తియుఁ భువనసుందరుఁడుఁ సుకుమారదేహుఁ
వరనృపలక్షణాంశమున♦భాస్కరతేజమునొప్పివిద్యలఁ [డై
నిరుపమపాండితిఁ వడయు ♦ నేర్పునవేంకటనారసింగరా
డ్వరుమహనీయమైన గుణ ♦ వర్ణన వర్ణితమయ్యెనంతటఁ

సీ॥ కడుపేదవానికిఁ ♦ గనకమబ్బినయట్లు
గల్పవృక్షమునింటఁ ♦ గాంచుపగిది
దాహైనవానికి ♦ ధనలబ్ధముగుకీతి
పిరికిపందకుహారి ♦ కరుణసరణి
మృత్యుభయమున క ♦ మృతమ్ముఁ జిక్కినభాతి
వైరాగ్య విషయముల్ ♦ వదలు సరణి
మ్రొక్కఁబోయిన వేల్పు ♦ మోఁలనిల్చినయట్లు
ననిశూరునకు ఖడ్గ ♦ మబ్బు సరణి

గీ॥ రాజబాయగు దేశాయి ♦ రమణినార
సింగభూపాలుదత్తును ♦ జెందుటెల్ల
బూర్వపుణ్యాంవుఫలమున ♦ బొసఁగెఁగాని
యరదుఁగాదటె! సద్గుణు ♦ లబ్బుటెలను. 137

సీ॥ చెఱుపనేరఁడు విశ్వ ♦ సించి జేరినవాని
నఖిలమేంవఁడునీచ ♦ మోసవసుల ...

నిందింపనేరఁడు ♦ నరిశత్రువులనైనఁ
బొంకనేరఁడుహాస్య ♦ మునకునైన
విడువనేరఁడుసదా ♦ విద్వద్వరులగోష్ఠి
తల్లిదండ్రులఁజూచు ♦ దైవములగ
నడుగఁబెట్టఁగనేరఁ ♦ డపయశంబగుత్రోవ
జనఁగనేరండార్త ♦ జనముఁద్రోచి

గీ॥ నాల్గుపదముల ధర్మంబు ♦ నడపుచుండు
గరుణరసమున దీనులఁ ♦ గాచుచుండు
నవనిమితభాష వ్రతముచే ♦ నలరుచుండు
రమణవేంకట నరసింగ ♦ రాయనృపుఁడు. 138

గీ॥ ఎలమినింద్రుండు సురలోక ♦ మేలినట్లు
శ్రీమండలకాపురంబు రక్షించుసరణి
సరస లింగన్నపేట సం ♦ స్థానమరయఁ
బాలనముఁజేయు నరసింగ ♦ ప్రభుఁడు ధరను 139

గీ॥ సంతతముజాగరూకుఁడై ♦ సర్వరాష్ట్ర
కార్యములఁజూడ స్వయముగాఁ ♦ గాంచుచుండు
పౌరజనముల ముంగొంగు ♦ పసిఁడిగాఁగ
నరయుచుండును కుశలమ్ము ♦ ననుదినంబు. 140

వ॥ ఇవ్విధంబున శ్రీగోరంట వేంకటనరసింగరావు
సర్దేశాయిగారు రాజ్యపాలనముఁ జేయుచుండుతరి!

సీ॥ సకలభూపాలకా ♦ స్థానహర్మ్యంబులు
వర్ణితంబే రాజు ♦ ప్రతిభ నెప్పుడు
గడుబీద లేరాజు ♦ కరుణకు పాత్రులై
సన్నుతింతురు హరి ♦ స్మరణగాఁగ
దిగ్దిశ లేరాజు ♦ దివ్యయశోలక్ష్మి
బ్రహ్మోత్సవంబుగఁ ♦ బరిణమించు
సుకవిగాయకశ్రేణి ♦ స్తోత్రపాఠంబుల
నలరు నేరాజు గే ♦ హాంగణంబు

గీ॥ నతఁడు 'తడసిన' వంశాబ్ధి ♦ నలరినిండు
చందురుండన గ్రాంతి సం ♦ స్థానమునను
భద్రయశమునుఁ బాలించుఁ ♦ బ్రభుఁడు చూడ
రమ్యగుణనిధి గోపాల ♦ రాయ నృపుఁడు. 141

సీ॥ అలకాధిపతికన్న ♦ నమృతాంశుననుగేరి
కలిమిరూపునమించి ♦ నలరువాఁడు
జలజాప్తుఁ దేఁగురాము ♦ నలవాయుజునిమించి
కరుణవీర్యంబులఁ ♦ గ్రాలువాఁడు
సురరాజ్యముంమీరి ♦ వరవైభవంబులు
నిజరాజ్యమునగల్గి ♦ నెగడువాఁడు,
తనపురంబునఁగల ♦ జనుల బిడ్డలమాడ్కిఁ
శుభదృష్టి నిరతంబుఁ ♦ జూచువాఁడు

గీ॥ శాంతితనుఁగూడ సత్యమ్ము ♦ సరసనుండ
దైవభక్తియు గురుసేవ ♦ దనరుచుండ
రమణవేంకటగోపాల ♦ రాడ్విభుండు
దాంతిసంస్థానమేలెడి ♦ దొరయతండు 142

గీ॥ చిత్తమలరఁగనీరాజు ♦ జేష్ఠపుత్రి
భవ్యవేంకట నరసాంబ ♦ భాసురాంగి
నిచ్చి పెండిలిఁజేసెను ♦ హెచ్చుగాను
రమ్యగుణదాముసరసింగ ♦ రావుకెలమి. 143

గీ॥ ఈమహీవరుభార్యయై ♦ యింతులందు
సాధ్వియైనట్టినరసాంబ ♦ సద్గుణాంబు
లరయనుతిజేయతరముకా ♦ దబ్జభవుని
నాల్గుమోముల, శేషుని ♦ నాలుకలకు. 144

సీ॥ శివునికర్థాంగియై ♦ చెల్వొందుగౌరికిఁ
సమతుల్యమీనాతి ♦ జాడఁజూడ
హరికురోభూషణం ♦ బైనశ్రీలక్ష్మికి
సమతుల్యమీనాతి ♦ జాడఁజూడ
నలువవాక్స్థానంపు ♦ నలినాక్షివాణికిఁ
సమతుల్యమీనాతి ♦ జాడఁజూడ

సురరాజభార్యమై ♦ శోభిల్లిడాశశి
సమతుల్యమీనాక్షి ♦ జాడఁజూడ

గీ॥ మగనికనుకూలసతులు ♦ సిగలఁబూవు
గవుల పెన్నిధిబుధులకుఁ గల్పతరువు
పౌరజనముల ముంగొంగు ♦ పసడిగాఁగ
నయతెనర్చిల్లు వేంకట ♦ నర్సమాంబ. 145

గీ॥ సరసిజాక్షులనల్వుర ♦ శాంతమతులఁ
గాంతులంగాంచిచక్కని ♦ కొమరనొకనిఁ
బడసివడసెను నోముల ♦ పంటగాఁగ
మన్మథాకారుగుణగణ్యు ♦ మహితశీలు. 146

గీ॥ కనులపండువగాఁగను ♦ గాంచి సుతుని
నామకరణంబుఁజేసెరి ♦ ప్రేమనలర
సచ్చిదానందరావన ♦ జగతిఁదనరఁ
దల్లిఁదండ్రులుభూరిమో ♦ దంబుఁగనుచు. 147

కం॥ అతిసున్నిసేయుక్రీడలు
దశదిశలవెలుంగఁగీర్తి ♦ దనరఁగఁబృథ్విన్
శశిధరుఁడో లేకహరియో
శిశువైజన్మించెననుచు ♦ శిష్టులుపొగడన్. 148

సీ॥ బీరంబునం జేరి ♦ పేర్మిఁ బౌరులఁ గొలువు
నుండు చందమునఁ గూ ♦ ర్చుండ నేర్చు
ధర్మంబు నాల్గు పా ♦ దంబుల నడపించు
ననురీతి వత్స జో ♦ గాడ నేర్చు
పల్కుఁ బల్కునఁ దేనె ♦ లొల్కఁ గా నొక్కొక్క
పలుకులు ముద్దుగాఁ ♦ బలుక నేర్చు
వర్ణాశ్రమంబుల ♦ వరుసఁ దప్పక యుండ
నిలిపెడనను భంగి ♦ నిలువ నేర్చు

గీ॥ బాలుఁడీరీతిఁ గ్రీడలఁ ♦ బ్రబలుచుండి
మోదమునఁ గూర్చు ముద్దుల ♦ మూటగాఁగ
దల్లిదండ్రులకనిశంబుఁ ♦ దనయుఁ డైన
సచ్చిదానందయువరాజు ♦ శాస్త్రితుండు. 149

చ॥ సుతుడును కూతులున్ వెలయ ♦ సూనృతచారణి నర్సమాంబస
మ్మతి నిజబంధువుల్ హితులు ♦ శాస్త్రవిశారధులైన సత్కవీ
తతియును పండితావళిస ♦ దాతనుఁ జేరి భజించుచుండ శ్రీ
పతికృపనారసింగనృప ♦ భాస్కరుకీర్తి వెలింగెనల్దిశల్ 150

సీ॥ తనవినిర్మలకీర్తి ♦ యనిశంబు భూపాల
నరులకుమిగుల సం ♦ బరముఁ గూర్పఁ

దననిరంతరమహా ♦ దార్యంబుసకలార్థి
జనులకుఁగల్పభూ ♦ జంబుగాఁగ
దనభుజాటోపంబు ♦ దర్పితరిపుప్రాణ
చయముకుఁగాలపా ♦ శంబుగాఁగఁ
దన దయారస దృష్టి ♦ ధారుణీజనముల
పాలిటముంగొంగు ♦ పసడిగాఁగ

గీ॥ వలరిజితమారురణవీరు ♦ ఘనవిదూరు
సరసగుణగణ్యునరసింగ ♦ క్ష్మాతలేంద్రుఁ
డాయురారోగ్యసిరులతో ♦ వలరివృద్ధిఁ
గీర్తిగాంచుత శ్రీహరి ♦ కృపను ధరను. 151

వ॥ అనియిట్లు తద్వంశావతరణంబ భివర్ణించియభ్యుదయ పరంపరాభివృద్ధియు నభీష్టఫలసిద్ధియుంగా నాశీర్వదించి నాయొనర్పంబూనిన శ్రీరుక్మిణీ కళ్యాణ కథాక్రమంబెట్టిదనిన.



శ్రీరస్తు.

# కథాప్రారంభము.

క॥ శ్రీమహిమోన్నత శుభకర
నామాశ్రిత పారిజాత! ♦ నారదవినుతా!
భీమాసురభూభృత్సు
త్రామా! సుగుణాభిరామ! ♦ రవికులసోమా! 1

గీ॥ సూతు బహుపురాణ కథాస ♦ మేతు నిఖిల
భువనవిఖ్యాతుఁ బరిపూతు ♦ బుణ్యచరితుఁ
గాంచి మునిముఖ్యు లడిగిన ♦ కథల శుకుఁడు
పాండవాన్వయు తోనిట్లు ♦ బలుకఁ దొడఁగె. 2

ఉ॥ ధీరుఁడు రైవతుండుమును ♦ తేకువతోడ విరించియాజ్ఞచే
సారసగంధినిన్ సుగుణ ♦ సాంద్ర విశారదమైన రేవతిన్
మీఱినప్రేమ బంధులను♦మేలుసుపర్వులు మెచ్చ; హెచ్చుఁగా
సీరికినిచ్చి పెండిలిని ♦ జేసె బుధుల్ నుతిసేయ భూవరా! 3

క॥ మును నీకు నీకథాకృతి
వినుపించితిఁగాదె భూప! ♦ విస్మయమలరన్
వినినాఁడ విపుడుమాధవు
ఘనమగు కళ్యాణగాథ ♦ కరము వచింతున్ 4

మ॥ గరుడుండాసురనాథుఁగెల్చిసుధమున్ ♦ గైకొన్న మార్గంబు
ధరణీనాథులఁజైద్యసాల్వలభుజా ♦దర్పంబు వోనాడిశ్రీ [నన్
కరచంద్రాననఁ బద్మ భీష్మకసుతన్ ♦ కంజాక్షినిన్ రుక్మిణిన్
వరుసండై హరి తెచ్చె; వేల్పులుసుమా♦వర్షంబువర్షింపఁగన్. 5

క॥ అనవిని యర్జున పౌత్రుఁడు
మనమునఁదళుకొత్త ముదము, ♦ మానీంద్రునితో
వినయంబుఁగదుర నిట్లనుఁ
జనువును నొకకొంతగలిగి ♦ ధర్మావరుఁడవనిన్ 6

క॥ ఒక్కఁడె కృష్ణుం డెటువలె
జక్కడఁచెను బోరిమగధ ♦ చైద్యుల నవిలో
నక్కజముఁ దోఁచెనెమ్మది
నిక్కము వచియింపు మౌని ♦ నెమ్మి యనవుడున్ 7

క॥ సులభంబులు ముక్తికి. మద
కలభంబులు గాఁజేలోభ ♦ కంజములకు, దుః
ఖలయంబులు శమన మనో
చలనంబులు, కృష్ణనామ ♦ సంస్మరణంబుల్ 8

క॥ పరమేశు విమలచరితముఁ
బరమంబగు భక్తి వినిన ♦ భవహరమగునో
కరుణానిధి! బుధనుత ముని
వర! తెలుపంగదవయ్య! విన ♦ వాంఛింతు మదిన్, 9

వ॥ అనవిని శుకమునీంద్రుఁ డిట్లనియె. 10

మ॥ సకలాధీశుఁ డనంతుడవ్యయుఁడుసా • క్షాద్విష్ణుఁడీధాత్రిలో
నకళంకంబుగఁగృష్ణ రూపమున మా•యామానుషాకారియై
టకునౌ మూలములక్ష్మిభైష్మియయి బుట్టన్ హేతు వేదవ్యానో
సకలంబున్ వినిపింతునయ్య!వినుమా!•క్ష్మానాథ వంశోత్తమా!

చ॥ ఇలను విదర్భదేశమున • కెంతయు వన్నెనుఁ బెట్టి భవ్యమై
వెలయుచు రాణఁ జెంది నృప•వీరునికిన్ నిలయంబుగాఁగ శో
భిలుచును గుండినంబనెడి • పేరున వర్థిలుచుండె నీధరా
లలనకుభూషణంబనుక • ళన్ సిరులొప్పుచునుండునప్పురిన్ 12

క॥ అతులప్రాభవసుశ్రీ
యుతమై నల్దిశలఁగీర్తి • యొప్పుచుఁ దేజో
వితత శతఘ్నీ శతపరి
వృతమై యప్పురము వెల్గు • విశ్రుత భంగిన్ 13

గీ॥ చారుతర శిల్ప నైపుణీ • సర్వశస్త్ర
యంత్రసముదాయ రిపుభయ • తంత్రనిలయ
హాటకాంచిత సౌధక • వాటగోపు
రములతో నొప్పివెల్గునా • రాజధాని. 14

సీ॥ సూతమాగధ యోధులు • సురుచిరముగ
నిండికొలువుండఁ గన్నుల • పండువయ్యె

వార వనితల నృత్యోత్స ♦ వములతోడ
నలరుచుండును సురలోక ♦ మనఁగ భువిని. 15

క॥ కరి హరి రథ వైమానిక
పరివృతమై ఘనగభీర ♦ పరిఖావృతమై
పరులకు దుర్భేద్యంబై
కరమొప్పుచు నప్పురమ్ముఁ ♦ గ్రాలుచునుండెన్ 16

చ॥ అలరఁగ నప్పురోప వన ♦ మందున హంసలు రాజకీరముల్
సలలిత శారికా విహఁగ♦సంతతిఁ గూయఁగఁగోకిలంబులున్
జెలఁగి నినాదముల్ వరలఁ♦జేయఁగనావనలక్ష్మిసొంపు పెం
పలరఁగ నృత్యగాత్రముల ♦ నచ్చట నాడెడి రీతిఁదోచెడిన్.

వ॥ ఇట్లుభాసమాన తేజోవిరాజితంబగుచుండిననగరంబు నిఖిల సంపత్సముదాయసంచితంబైనయలకాపురంబుభాతి, పరబ్రహ్మవిచారణ తత్పరంబగుటచేత సత్యలోకంబుకైవడి, దివ్యమగు దేవభాషావైష్ణవాలంకార పరిశోభితంబగుకతంబునఁ బుండరీకాక్ష పాలితంబగు వైకుంఠంబులీల, దృఢతపస్సంపన్నసిద్ధ పరిశోభితంబగుటవలన ప్రమధగణసేవిత రుద్రపరిపాలితమగు కైలాసంబుపగిది, సకలజన మనోరథ సఫలీకృతంబగు కారణంబున భోగవతీ పురంబు తేవఁబవిత్రం శారదచంద్ర [illegible] స బకబలాకాది విరా

జితంబులగు సరోవరంబులను, సరసజనక్రీడా యోగ్యంబులగు నుద్యానవనంబులును, గజరథాశ్వములు విచ్చలవిడిగా నడయాడుటకు మేలగురజితచూర్ణ మిశ్రితమయంబై ధవళాకృతిని వెలింగెడి రాజమార్గంబులను, రాజమార్గంబుల కుభయపార్శ్వంబుల రసాలసాలంబులును, సాలంబుల కడ్డంబుగాఁ గట్టంబడిన విద్యుద్దీపికాతంతువులును, తంతుమధ్యాంతర్గతంబునఁ బ్రజ్వరిల్లెడి దీపికాగోళంబులుంగలిగి దేవేంద్రపురంబును ధిక్కరించెడిచందంబున మణిస్థగిత కనకహర్మ్య సముదయప్రకాశంబునుంగల్గి సకలసౌభాగ్యసాలంకృతంబై యొప్పెడి నప్పురంబున.

ఉ॥ అరయఁగ నప్పురద్విజులు ♦ నచ్యుత దివ్యపదారవింద సంస్మరణముఁజేసి వేదములు♦జక్కఁగ దాముబఠించి ధర్మమాచరణముఁజేసిపౌరులకుఁ♦శాస్త్రములన్నియు నేర్పినిచ్చలుఁ
సురలనుమించె భూసురులు ♦ సూనృతవృత్తిని నెల్లవేళలన్

సీ॥ స్నాన సంధ్యలు ధ్యానమ్ము ♦ జపము తపము
విధిగ నిత్యాగ్ని హోత్రంబు ♦ విడునకెపుడుఁ
దిరుగుచుందురె గాని జం ♦ దెములుఁదీసి
వంకెలను బెట్టరప్పురి ♦ బాపలెపుడు. 20

చ॥ అమరఁగ దేవదానవుల ♦ సంచిత బాహుబలంబుగేరి, భీ
విఘలయశః ప్రతాపముల♦విస్తరిలంగఁబరాక్రమంబునన్

దమకముతోడఁ బోరఁగల♦ధైర్యముఁ గల్గియు నర్థిరక్షణా
సుమతులువీరవర్యులుయు శోభనమూర్తులుక్షత్రియోత్తముల్

చ॥ ధనదుని నీసడించి విబు♦ధావళినిన్ దగనాదరించి స
జ్జననుతమైన ధర్మములఁ♦జక్కఁగ జేయుచు నెల్లప్రొద్దులం
బనివడి నీతిశాస్త్రముల♦పద్ధతిఁ గాంచియుఁ గూర్మిబీదలన్
గనికరమొప్పఁ బ్రోతురతి♦గౌరవనీయులు వైశ్యులప్పురిన్

గీ॥ అనఘ! నాల్గవ జాతివా ♦ రతులమైన
ఘనపరాక్రమ మావీర్య ♦ మున వెలింగి
కృషియు గోరక్షణంబునఁ ♦ గెరలుచుండి
ప్రబలి వర్ధిల్లుచుందు రా ♦ పట్టణమున. 23

ఉ॥ జారులు లేరు పేర్కొనఁగఁ♦జారు లసద్గుణరూపులే యనా
చారులు లేరు, తత్త్వసువి♦చారులు, శూరులె ఘోరతస్కరా
కారులు లేరు, నిచ్చలుప♦కారులుగాని తలంప నప్పురీ
పౌరులలోన నెచ్చటను♦పాపులు కోపులు లేరుచూడఁగన్.

ఉ॥ ఆపురి నేలుధాత్రివరుఁ♦ డంచిత భూరిభుజాబలంబు చేఁ
జాపముఁబూని వీరరిపు♦ శత్రులడంచుచుఁ గీర్తినల్దిశల్
వ్యాపితమొందఁగా సుజన♦వందితుఁడై యలరారుభీష్మకా
ఖ్యాపతి భీష్మకుండనెడి♦ భూపలలాముఁడు మేదినీశ్వరా!

వ॥ ఆమనుజేశ్వరుండు కొంతకాలంబునకు నిజకాంతయందు.

గీ॥ రుక్మి రుక్మరథుండును ♦ రుక్మబాహు
రుక్మకేశియు మీఁదట ♦ రుక్మనేత్రుఁ
డనెడి నేవురుపుత్రుల ♦ నంతగొంత
కాలమేఁగఁగ నొకసుతఁ ♦ గాంచె నతఁడు. 27

ఆ॥ పాల కడలి వోలెఁ ♦ బార్థివు గేహంబు
దనరఁ దొడఁగె నూతు ♦ తనకుఁ గలుగ
సిరినిఁబోల్పఁదగిన ♦ చిహ్నంబుతోఁబుట్టె
నంచుసంతసించె ♦ నధిపుఁడధిప! 28

చ॥ కరమపురూపమై చెలఁగు ♦ గౌరవమొప్పఁగ విప్రకోటికిన్
బరఁగనభీష్టమై వెలసి ♦ భాసిలు కాంచన రత్నహారముల్
పరమసుకీర్తితో నొసఁగి ♦ బంధుల మిత్రుల నెల్లవారి సం
భరితముదంబుఁగూర్చెనిజ♦పంక్తినివారికివిందొనర్చుచున్.

ఉ॥ అత్తరి హేమరత్నమయ ♦ హర్మ్యతలంబున సంతసంబునన్
జిత్త వికాసమౌ మణివి ♦ శేష సమంచిత రమ్యడోలికన్
బుత్తడి బొమ్మనాగ నృప♦పుత్రిక నూపుచు జోలపాటలన్
మత్తమ రాళగామినులు♦ మంజుగళంబుల బాడిరెంతయున్.

వ॥ అంత గొంతకాలంబున కాబాలిక కన్నప్రాశనంబుఁగావింప
మెసతక నాగడంబుసేయ దాసీజనంబులా శిశువునుఁ జాల

నిడుకొని సౌధాంతరంబున నిలువంబడి యాచిరుతనుబుజ్జ
గించు నుపాయంబుఁ గానకనాకసంబువంక నిందుచందురుని
వ్రేలఁజూపుచు నిట్లనిరి. 31

ఉ॥ అల్లదె తారకాధిపతి ♦ యాకసమందున నిన్నుఁజూచి రం
జిల్లుచు దుగ్ధముల్ మధువుఁ♦జిందెడియాకదళీఫలంబులుఀ
గొల్లలుగాఁగఁదెచ్చెనిది కూరిమిఁ గైకొనుమమ్మయంచురం
జిల్లఁగఁ జేతురాసతులు ♦ చిన్నితనూజగు రాజపుత్రికిఀ.

ఆ॥ రజిత పాత్రిమందు ♦ రాజిల్లు నన్నంబు
పసడిపాత్రియందు ♦ పాలుఁ బోసి
చందమామఁజూపి ♦ సంతోషమునఁ బువ్వ
దినఁగ జేతురధిప! ♦ తెలివ లపుడు. 33

వ॥ ఇట్లు దినదిన ప్రివర్ధమాన యగుచు ద్వాదశ వర్షంబులు
నిండిన యబ్బాలికామణి. 34

ఉ॥ అచ్చపు వజ్రిహారతతి ♦ నక్కునఁ దేజముసొంపునింపఁగా
నెచ్చెలు లందరిన్నొకట♦నెయ్యముతో జతఁగూర్చి యాడుచుఀ
ముచ్చటఁగూర్చుచుండె కడు♦ముద్దులమాటలఁ దల్లిదండ్రులఀ
హెచ్చుగ నాటపాటలను ♦ నింపుగరుక్మిణి శైశవంబునఀ. 35

సీ॥ చిగురుటాకులఁ బోలు ♦ చిన్ని చేతుల తోడ
బొంగరంబులు చిత్రి ♦ భంగియాడు

బాలికామణులతోఁ ♦ బఱువెత్తి యొకసారి
ప్రీతితో దాగురు ♦ మూతలాడు
కమలాక్షి యొకమారు ♦ కౌతూహలంబొప్పఁ
గ్రిమములో నచ్చన ♦ గాయలాడు
సంతసం బిగురొత్తఁ ♦ జపలాక్షి యొకవేళ
బూలబంతుల నాడ ♦ బూనుచుండు

గీ॥ గూర్మిఁ జెలరేగి యోమన ♦ గుంటలాడు
పిల్లలం జేరి చిరుతన ♦ బిల్లలాడుఁ
బ్రీతి రెట్టింప బొమ్మల ♦ పెండ్లి సేయుఁ
గోరి సఖులకు గుజ్జన ♦ గూళ్లు వెట్టు. 36

క॥ ఆలేతప్రాయమందున
బాలికలఁ గూడియాట ♦ పాటలఁగదురన్
బాలామణి రుక్మిణిఁగని
చాలఁగమది సంతసిలెను ♦ జననీజనకుల్. 37

సీ॥ ఆచిన్నపాప దా ♦ నభివృద్ధిఁ బొందుచు
స్వేచ్ఛగాఁ దిరుఁగాడ ♦ సిగ్గుఁగనియె
మగవారి యెదుటను ♦ మగువ నిల్వఁగ జంకె
తరుచుగా రాదయ్యెఁ ♦ దండ్రికడకు

వింతవింతలు మేన ♦ వెలఁది కాంచఁదొడంగె
దొలఁగనీయదు పైట ♦ నెలఁత యెపుడు
వాలుచూపులు వింత ♦ యొయ్యారములనేర్చి
పలుకులందునఁ దేనె ♦ లొలకఁజేసె

గీ॥ ప్రౌఢభామలు ఝషకేతు ♦ భావములను
కలుగుముచ్చట లాడెడి ♦ నెలవులందు
నుండగాఁబోదు సిగ్గున ♦ నుండునొకట
శైశవముఁబోయి యౌవన ♦ సంభవమున ౪౮

సీ॥ నిడుద పెన్నెరివేణి ♦ జడసోయ గమునింప
నెమ్మనంబునఁదేట ♦ నిండుకొనియెఁ
గనుఁదోయి లోసిగ్గుఁ ♦ గానుపింపఁగసాగెఁ
జెక్కులందున మెఱుపు ♦ లెక్కువయ్యె
కలదోలే దనురీతిఁ ♦ గలమధ్య మముతోడ
నందమైనట్టి నూ ♦ గారుఁదోచె
నూత్నయౌవనలక్ష్మి ♦ నోమినఫలమునా
గురునితంబప్రభా ♦ పరులుఁదోచె

గీ॥ నడకలందున హంసల ♦ దుడుకు మాన్పె
బలుకులందునఁ జిలుకల ♦ కలుకఁజేసె

నవ్వులందున మల్లిక ♦ శ్రీవర్ణించె
రమణి రుక్మిణి యవ్వనా ♦ రంభమందు. 39

ఉ॥ అంతట రుక్మిణీమణికి ♦ నంచితమై చనుదోయయొప్పిన
త్యంతము మానసాబ్జమున ♦ నంగజభావములంకురించెమో
మెంతయుఁ దేజరిల్లె, సిరు ♦ లీనుచు నానళినాక్షిచూడ్కులున్
గంతునిమేలు బాణముల ♦ కైవడి దోచెమనోహరంబుగన్.

మ॥ తలుకార్మెల్మి పసండిబొమ్మకరణిన్ ♦ దట్టంపునెమ్మేనిచా
యలునల్దిక్కులఁగ్రమ్మిపర్వఁగవయ ♦ స్యాబృందముగూడితా
బలుసంతోషముతోడసుందరవనా ♦ వాసంబునన్ జూడఁగాఁ
గలకంఠీమణియేగెమానసమునం ♦ గౌతూహలంబొప్పఁగన్

వ॥ ఇట్లు సఖియలంగూడుకొని చతుర్వినోదంబునకై నిర్మించిన దర్శనవనంబునఁ బ్రవేశించియందుగల లోహపంజరాంతర్గతసింహశరభ శార్దూల శశిశల్య భల్లభల్లూక సారంగసాలావృక వరాహ మహిష మహోరగ మర్కటనిఖిల మృగావలోకనంబుఁజేసి, హర్షించి, శారికాకీర మయూర హంస కారండవకుక్కుటజలకుక్కుట బకబలాకవిహంగ కలకలరవంబుల నాకర్ణించుచు, చిత్రవిచిత్రభర్మ వినిర్మిత సాలభంజికలంగాంచి సంతోసించి, యావనమధ్యమంబున

మణివిభాసితంబైన కొండొకమందిరంబునఁ బ్రవేశించి
నృప నృపకుమారుల చిత్రపటంబులం బరిశీలించి యవ్వా
రలయన్వయ నామగోత్రంబులు నెచ్చెలినడుగ నాయిందు
నిభాస్య క్రమంబుననిట్లు వక్కాణింపఁదొడంగె. 42

చ॥ సరసిజనేత్రి! యీనృపుఁడు సంగరమందు విరోధివర్గముల్
ధరణిని మ్రగ్గఁజేసి నిజ దర్పిత ఖడ్గప్రతాపకీలలో
నరిబలమంత దొట్రువడ నంచిత బాహుబలుండు సజ్జనా
భరణుఁడు ధర్మవర్తనుఁడు భద్రతమాళవ నేలుసీతఁడే!

ఉ॥ వీరుఁడితండు మేటిరణ విక్రమ తేజుఁడు బేరుఁగన్న గం
భీరుఁడు భాగ్యవంతులఁగుబేరుఁడుఁ బోరున మేటి విక్రమా
కారుఁడుమారు గేరునర కాంతులతో వెలుఁగొందుసుందరా
కారుఁడుదుర్జనప్రకర కాలుఁడుధీరుఁడు చైద్యుఁజూడుమా!

మ॥ అతివా! యీతఁడు ద్రావిడాధిపతిపో రండంగ లేకెందరో
క్షితిలోనన్ గడుభీతిఁబాఱ ధృతియు క్షీణప్రతాపంబునన్
గుతుకంబొప్పఁగ మేదినీతలమునన్ గోదండ ముంబూనిదు
ర్గతులన్ బట్టఁగఁ జేయువాడు నృపులన్ గంభీరయుద్ధంబునన్

శా॥ ఏణీలోచన! యీమహీధవుఁడు ధా త్రీశావతంసుండు వే
పాణింజాపముఁబూనినంతట నెదిక్పాలుల్ భయంబొందియూ

క్షోణిం బాపియుఁ బృథ్వీశులెత్తుదురు శ్రీశూలిందగంగాల్చిదా
బ్రాణంబుల్ గలబాణముల్ వడసె భూపాలాన్వయుం జూడవే!

వ॥ అంత వేఱొక పార్శ్వంబునంగల పటంబుల నన్నియుం
జూపుచు. 47

సీ॥ సుదతి! చూచితె నృప ♦ సోముఁడీతఁడు పృథ్వి
పాలించు కొంకణ ♦ పతిభువితండు
నతివ! కాంచుము వీని ♦ యందమ్ము చందమ్ము
నేపాళదేశపు ♦ నృప వరుండు
పడతి! విలోకించు ♦ భాసురంబుగ లాట
దేశంబునేలు మ ♦ హీశుఁడితఁడు
కుటిలకుంతల! చూడు ♦ కుంభినీందు్రలలోన
నందమొప్పెడి పాండు ♦ నందనులను

గీ॥ అంబుజాతాక్షి! కాంచితే ♦ యమరవిభుని
సముఁడు దృతరాష్ట్ర నృపుపెద్ద ♦ కొమరుఁడితఁడు
నతఁడు కర్ణుండు వీరుఁడు ♦ నర్కతేజుఁ
డవనినాథులు వీరలు ♦ నరయుచెలియ! 48

వ॥ అనియిట్లు పటంబులన్నియుం జూపుచుఁ బిమ్మట దివ్య
మాలాలంకృతంబైన యొండొకపటంబు దెసకుంజనియిట్లభి
వర్ణింపఁదొడఁగె. 49

సీ॥ నీలరత్నచ్ఛాయ ♦ నెగడు కాయంబునఁ
గనకాంబరంబునుఁ ♦ గ్రాలుచుండ
బహువిశాలం బైన ♦ భాసిల్లువక్షంబు
శ్రీవత్స లాంఛన ♦ శ్రీలు వెలుఁగ
మస్తకంబున దివ్య ♦ మణికిరీటముఁ గర్ణ
కుండలంబులు కాంతి ♦ గండుమిగుల
జానులనంటుహ ♦ స్తముల శంఖముఁ జక్ర
మును ప్రకాశింపఁగ ♦ ముదముఁ దోప

గీ॥ ఫాలతలమున తిరురేఖ ♦ పరిఢవిల్ల
హారవితతులు నురమునం ♦ దతిశయింప
భళిర! యీరాజ కందర్పు ♦ చెలిమి నీకుఁ
గలుగవలదె! తొలిపుణ్య ♦ ఫలము కలిమి. 50

వ॥ దేవి! యీరాకుమారుని చరిత్రంబించుక నెఱింగించెద
వినుమని యిట్లు చెప్పందొడంగె. 51

చ॥ యదుకులవార్థిచంద్రుఁడుద ♦ యాగుణసాంద్రుఁడమందసుం
స్పదుఁడమలప్రతాపుఁడువి♦శాలయశోనిభమూర్తి సంతత [దరా
త్రిదశగణార్చితుండు వసు ♦ దేవతనూజుఁడు గోపికామనో
పదమలమానసాస్పదుఁడు ♦ చక్రిధరుండగు కృష్ణుఁడీతఁడే! 52

గీ॥ బాల్యమందున గోపికా ♦ వాటియందు
నాచరించిన లీలల! ♦ నభినుతింతు
వినుము వినినంత నీకు నీ ♦ వేల్పుతేరి
మీఁదచిత్తంబుఁ దగులకఁ ♦ బోదు తరుణి! 53

సీ॥ పాలుఁద్రాగెడి లేత ♦ ప్రాయంబు నందునే
బలితంపుపూతనఁ ♦ బొలియఁజేసె
మారుతాసురుఁ ద్రుంచె ♦ మద్దులఁ బెకలించి
బకనామ రాక్షసుఁ ♦ బట్టిఁజంపె
శంఖచూడునిఁ గూల్చెఁ ♦ జక్కాడె వృషదైత్యుఁ
గేశిరాక్షసు వ్యోము ♦ గీటణంచె
నఘరాక్షసునిఁ దేర్చె ♦ నతులకాళియునొంచె
దవశిఖిమ్రింగి గో ♦ త్రిముధరించె

గీ॥ బరగజాణూర కంస స ♦ ద్బలులఁ దునిమె
నలజరాసంధ మూర్ఖులౌ ♦ ఖలులఁ దఱిమె
నరయనిల్పెను ద్వారకా ♦ పురిని జలధి;
మనుజమాత్రుండె రుక్మిణీ! ♦ మాధవుండు. 54

ఉ॥ చెప్పెడిదేమి కృష్ణు యదు♦శేఖరు చక్కదనంబుఁగన్నులం
దప్పకజూచితేని యల ♦ దర్పక ఘోరశిలీ హతాత్మలై

ఉ॥ మానినిమీఁద నాతలఁపుమగ్నము నొందుటచేత నెమ్మదిన్
బూవను సౌఖ్యచింతనము ♦ భోగము లెవ్వియుఁగోరనొల్ల నే
భూనుతమైన భోజసుత ♦ భూసుర! నేనిటఁదెచ్చి రుక్మినిన్
మానవనాథులై వెలయు ♦ మాగధ చైద్యులఁ గూల్తు నెంత

వ॥ అనియిట్లు జెప్పి వాసుదేవభూసురవరులిరువురు [యున్,

గీ॥ గరుడకేతన రథమునఁ ♦ గట్టఁజేసి
సైన్య సుగ్రీవ మేఘపు ♦ ష్పక వలాహ
కంబులను నశ్వములను వి ♦ ఖ్యాతి వెలుఁగు
నరథమందున నెక్కిరి ♦ హరియు ద్విజుఁడు. 69

చ॥ అరదపు రథ్యముల్ మణిగ ♦ ణాంచిత భూషణ భాసితంబులై
వరలెడి వాసుదేవుని వి ♦ వాహమహోత్సవ దర్శనార్థమై
నరిఁగెడిరీతిఁ దారకుని ♦ హస్తపు సంజ్ఞ లెఱింగి తీవ్రతన్
బఱుఁగిడి జేరెకుండినపుఁ ♦ బౌరులుసంతస మొందిజూడఁగన్.

వ॥ ఇట్లు శ్రీకృష్ణుండేకాకియై విరోధులగు సాళ్వజరాసంధ
పౌండ్రక శిశుపాలురఁగూడియున్న ప్రదేశంబునకుం బోయె
నని తెలసిబలరాముండు చతురంగబల సమేతుండై కుండిన
నగరంబునకువచ్చి వాసుదేవునిం గలిసెనని. 71

క॥ ఘనుఁడగు సూతుఁడు మునులకు
వినిపించినగతిని శుకుఁడు ♦ వివరించి పరీక్షి

జ్జనపతికిఁదెల్పి భూపతి
విని యవ్వలకథను భక్తి ♦ వినఁగోరుటయుః. 72

క॥ ఇనవంశజలధి హిమకర
ఘనవారధిసేతురచన ♦ కల్మషహరణా!
మునిలోకవినుత రాఘవ!
జనకాత్మజ హృదయలోల! ♦ జానకిరామా! 73

మాలిని

శరనిధి గభీరా♦శత్రువన్యాగ్నిరూపా!
గిరివర సమధైర్యా♦ కేవలానందభూపా!
ఖరదనుజ విరామా ♦కామితార్థప్రదీపా!
సురుచిరమృదుభాషా♦క్షోణిజాచిత్తవాసా! 74

ఇది శ్రీహనుమద్దేవ దయారస లసత్కటాక్ష
కవితాధురీణ వంతము గోపనార్య పుత్ర
ఆంజనేయకవి కృత శ్రీ రుక్మిణీ
కళ్యాణమను కావ్యంబునఁ
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ రుక్మిణీ కల్యాణము

## చతుర్థాశ్వాసము.

మద్రాజకులాంబుధి
సోమా! రఘురామచంద్ర ♦ సూరివరేణ్యా!
భీమాసుర భంజన రఘు
రామా! భూజాతహృదయ ♦ రాఘవ రామా!

వ॥ అట్లుసూతుండు శౌనకాదిమునీంద్రులకు జెప్పెడితెరంగున వ్యాసపుత్రుండర్జును పౌత్రునితోనిట్లను రుక్మిణీమణి హరిభూసురులజాడందెలియక నిజమనంబున నిట్లువితర్కింపందొడంగె. 2

గీ॥ లగ్నమాసన్నమయ్యెను ♦ రాడు హరియు
బ్రాహ్మణుండును ద్వారకా ♦ పట్టణంబుఁ
జేరెనో లేదొ! కృష్ణుండు ♦ చిత్తమందు
వినియుఁ దప్పఁగఁదలఁచెనో ♦ విధియెఱుంగ. 3

గీ॥ ఇటులఁజింతించుచుండెడి ♦ యింతికడకు
ధరణి సురవర్యుఁడరుదెంచి ♦ సురుచిరాంగిఁ

గాంచినంతోషహృదయ సం ♦ కలితుఁడగుచుఁ
బలికె నిట్లని రుక్మిణీ ♦ భామఁ జూచి 4

మ॥ సనకాదుల్ కనలేనిమాధవుహరిన్ ♦ జక్రిన్ ఘనున్ దుర్లభున్
వనితా! తెచ్చితిమెచ్చెనాతఁడునినున్ ♦ వారిన్ జరాచైద్యులన్
ఘనుఁడై యుద్ధతిఁబోరిరాక్షస లస ♦ త్కళ్యాణయుక్తి న్నినున్
వనజాక్షుండువరించిచేకొనుసుభ ♦ వ్యంబయ్యెనీజన్మమున్ 5

గీ॥ పూస గుచ్చిన కైవడి ♦ పొలఁతి నీదు
చరితమంతయుఁ జెప్పితిఁ ♦ జక్రిధరుఁడు
తరుణి! నినుఁబోలి నీపైనిఁ ♦ దగిలియున్న
చిత్తముంగల్గి యున్నాఁడు ♦ చెలువ వినుము! 6

సీ॥ ఇంద్రనీలపుకాంతు ♦ లెనయు దేహంబునఁ
బీతాంబరద్యుతి ♦ పిక్కటిల్ల
మేఘంబుతోనుండు ♦ మెఱపుఁ దీగెనుఁబోలి
వక్షస్థలిని కౌస్తు ♦ భము వెలుంగఁ
గమలాప్తకోటి సం ♦ కాశమై జెలఁగుచు
ఘనకిరీటపుకాంతి ♦ గ్రిందు కొనఁగ
నఖిల లోకంబుల ♦ కానంద మొనఁగూర్చు
కరుణాకటాక్షంబుఁ ♦ గాౘుచుండ

గీ॥ చారు కేయూర మణిమయ ♦ సారహీర
హారకుండల కాంతుల ♦ నతిశయింప
బర్హి బర్హావతంసుఁడై ♦ పరిబలు కృష్ణు
నరిది పొగడంగ నెవ్వారి ♦ కైనఁదరుణి! 7

మ॥ జగతిజ్జైద్యనృపాలపౌండ్రకజరాసంధాదిమందాత్ములన్.
జగతీశుండగుకృష్ణభూవిభుఁడనిన్ ♦ జక్కాడినిన్ గొంచుఁబో
వఁగనీయన్నయఁదండ్రియున్ వగచుచున్ వైవర్ణ్యముంబొందిమా
ర్మొగముల్ పెట్టరె!ధీరతన్ విడువరే! ♦ మోదంబునుందప్పరే

వ॥ అనవిని రుక్మిణీమణి. 9

ఉ॥ తల్లియుఁదండ్రియున్గుతువు♦ దైవముభ్రాతయుజుట్టమీవెనా
కెల్లవిధంబులన్ ద్విజకు ♦ లేశ్వర! యీవిపదబ్ధిఁదాటి నీ
వల్లనుఁగాదె నేమగుడఁ ♦ బ్రాణములందగనిల్పుకొంటినా
వల్లభుఁజూడఁగంటి నిక♦భవ్యతనీబుణమెట్లు దీర్చెదన్ 10

మ॥ సరసీజోద్భవంశ!నీమహిమనున్ ♦ సంస్తుత్యముంజేయనె
వ్వారిసాధ్యంబుమహాత్మ!గోపవిభునిన్ ♦ వర్ధిష్ణునిన్ మాధవున్
బరమాత్మున్ జనితోడి తెచ్చితివి మ♦త్ప్రాణంబుఁగాపాడి నన్
గరమొప్పన్ బ్రతికించునీకిదె నమ ♦ స్కారంబుఁగావించెదన్.

వ॥ అని యిట్లావిప్రసత్త్యుండు జేసినమహోప కారంబునకురుక్మిణీ
దేవి మనస్ఫూర్తిఁగా పునఃపునర్వందనంబు లాచరించి

వలయుపసదనంబులొసంగి పంపుసమయంబున బలరామ కృష్ణు లరుదెంచిరనువార్త విని భీష్మకుండెదురేగి పూజించి తోడ్కొని వచ్చుతఱిగోవింద సందర్శన కుతూహలంబునఁ బౌరసుందరులు గృహకృత్యంబుల వర్జించి మహాభక్తిని వస్త్రాభరణమాల్యాను లేపనంబు లమ్మహాత్మునికి నర్పింపఁ గైకొనివచ్చి మంగళహారతులు నివాళులిచ్చుచు నిట్లుము చ్చటించిరి. 12

సీ॥ పసిబాలుఁడై యుండి ♦ బండిరాకాసుని
నీడ్చితన్నిన నాతఁ ♦ డితఁడు కాఁడె!
కాళీయఫణిఁ గాలఁ ♦ గజ్జలందెలు మ్రోయ
నృత్యమాడిన యాతఁ ♦ డితఁడు కాఁడె!
వ్రేతలఁ జిత్తముల్ ♦ ప్రీతితో హరియించి
నేనుగానను నాతఁ ♦ డితఁడు కాఁడె!
గో గోప కులఁబ్రోవ ♦ గోవర్ధనము వ్రేల
నెత్తిన మహనీయుఁ ♦ డితఁడు కాఁడె!
గీ॥ బ్రహ్మవిద్యకు నితఁడు పో ♦ పట్టుఁ గొమ్మ
నిఖిల పురుషార్థ హేతువై ♦ నెగడు నితని
మగనిఁ గాఁగోరు రుక్మిణీ ♦ మగువ నోము
ఫలము వర్ణింపఁ దరమౌనె ♦ బ్రహ్మకైన. 13

వ॥ అని తదీయ రూపరేఖా విలాస విభ్రమంబులఁ బ్రసంగించు
చుఁ బురంధ్రీమణులు సంతసింపుచుండెడి సమయంబున
భీష్మకుండు నిజాంతికంబునుం జేరి రుక్మిణీమణి నలంకృతిఁ
జేయ నంతఃపురవాసులకాజ్ఞ నొసంగనవ్వారలు. 14

చ॥ సరసిజనేత్రలంత మది ♦ సంతసమొందుచు రత్నకంకణా
భరణ, వినీలగాత్రనవ ♦ పద్మదళాక్షిని రుక్మిణీమణిన్
సురుచిర పీఠమందుఁ గడు ♦ సొంపుఁదలిర్పగ నుండఁజేసిరా
దరమునమంగళాకర మృ ♦ దంగ నినాదములుప్పతిల్లగన్.

మ॥ లలనారత్నములంత మోదమలరన్ ♦ లావణ్యతన్ బాడఁగాఁ
దొలుకార్మేలు పసిండిపళ్లెరమునన్ ♦ దోరంపు రాగిన్నెలోఁ
జెలఁగన్ సంపగినూనె దెచ్చి యొకరా ♦ జీవాక్షియా లేమకున్
దలయంటన్ గరకంకణంబులఝణ ♦ త్కారంబులింపారఁగన్

మ॥ అలివేణుల్ దగరుక్మిణీమణికి నె ♦ య్యంబార పీఠంబుపై
నలుగుం బెట్టియు మేలుగందముల యా ♦ నారీశిరోరత్నమున్
జలకంబార్చిరి హేమపాత్రమున భా ♦ స్వత్పుణ్యతీర్థంబులన్
విలసన్మూర్తులు భూసురోత్తము లటన్ వేద ♦ స్మృతుల్
(సేయఁగన్. 17

సీ॥ మణిమయంబులునగు ♦ మంజీరములు పాద
కంజాతములఁ గూర్చి ♦ గరిత యొర్తు

హారిమధ్య మధ్యమ ♦ మందురత్నపు మేఖ
లమును బంధనఁ జేసె ♦ లలనయొూర్చు
గంఠస్థలిని ముౌక్తి ♦ కముల హారంబులఁ
బరిఢ విల్లఁగ నేసె ♦ భామ యొూర్తు
గరములందున రత్న ♦ కంకణంబులఁ గూర్చె
భాసురంబుగ మృదు ♦ పాణి యొూర్తు

గీ॥ గర్ణయుగమున వజ్రంపు ♦ కమ్మలలర
నాసికంబున ముత్యంబు ♦ భాసిలంగ
విరి సరంబులఁ బెన్నెటి ♦ వేణిఁ జుట్టి
కాంత యొూర్తురాసుత కలం ♦ కారమేర్చె. 18

వ॥ ఇట్లన్నివిధంబుల రుక్మిణీమణి నలంకరించి పెండ్లికుమార్తె నుంజేసి భీష్మకునికిందెలుప నారాజేంద్రుఁడు భవానీపూజంజేయఁ గూతునుంబంప నారాకన్నియ బంధుజనయుతంబుగా దేవీమందిరంబునకుంజని శర్వాణినింబూజించి ప్రణమిల్లి. 19

ఉ॥ పార్వతి! లోకమాత! నవ ♦ పద్మదళాయతనేత్ర! గౌరి! శ్రీ
సర్వజగన్నియామకవి ♦ శారద! శాశ్వత! సర్వలోకముల్
పర్వఁగఁజేయునేత! శివ ♦ భార్గవి! మేటిపురాణి! దుర్గ! శ్రీ
పర్వతరాజపుత్రి! మృదు ♦ భాషిణి! కాళిక! భద్ర! శాంభవీ!

శా॥ అంబా! మాయిల వేల్పువీవనచు నె♦య్యంబార నీపాదయు
గ్మంబుఁ గొల్చెడిదీనురాల; విలస ♦ త్కారుణ్యముంజూపి న
న్నుంబాలించియదూద్భవుఁ బతిగసంతోషంబునంగూర్చుమా
ర్గంబున్నీవ తలంపఁగా వలయునో ♦ గౌరీ! దయాంభోనిధీ! 21

వ॥ అనియిట్లు దేవీస్తోత్రంబునుం జేసి యారాచకన్నియ దుర్గా
మందిరంబువీడి వచ్చుసమయంబున. 22

క॥ హరిఁజూడఁ ద్వరిత మెందెడి
తరుణి పయిఁ జేసలిడిరి ♦ తరుణేందుముఖుల్
పరమంబగు రూపంబునఁ
దరుణీమణి వెలుఁగఁ దొడఁగె ♦ ధాత్రీవరేణ్యా! 23

క॥ రాజీవాక్షినిఁ జూచిరి
రాజిలి చైద్యాది నృపులు ♦ రమణీయముగన్
రాజీవాక్షి కనుంగొనె
రాజులఁ గడకంటిచూడ్కి ♦ రాజవరేణ్యా! 24

వ॥ అంత నొకదెస. 25

చ॥ కనియెను రుక్మిణీసుదతి ♦ కాంచనచేలుని నీలదేహునిన్
ఘనుని యదూద్వహుని ♦ గంజదళాక్షుని మందహాస ముం
దనిపెడి మౌళిపింఛుని సు♦ధామధురోక్తునికృష్ణుమాధవున్
మనమలరార భక్తజన ♦ మానసవాసుని నందసూనునిన్

వ॥ అంతనిఖిలలోకనాయకుండగు గోవిందుఁడరణ్యంబున జంతు
హృదయాందోళనంబొనర్చు సింహంబు పగిదియుచ్చటఁ
గల నృపమండలంబంతయు నివ్వెరఁబడుచుండ రుక్మిణీ
మణినిఁ జేరంజని. 27

చ॥ హరి రభసంబునుంగలిగి ♦ యంబుజనేత్రనుగ్రుచ్చియెత్తి తా
నరదమునందుఁజేర్చెనృపు ♦ లందరు నివ్వెరవోయి చూడ స
చ్చరితుఁడు రాముఁడగ్గునిజ ♦ సైన్యముతో నటవచ్చితోడ్పడెఁ
హరితన పాంచజన్యమును ♦ నద్భుత మొప్పఁగనూదె భూవరా!

వ॥ అనియిట్లు. 29

గీ॥ సంతసంబున సూతుండు ♦ సకలమునుల
కెఱుఁగఁ జేసినరీతి నా ♦ క్షితివరునకుఁ
దెలియఁ బరచెను శుకుఁడును ♦ దెలిసి నృపుఁడు
నవల కథఁగోరె వినఁగ తా ♦ నమితభక్తి 30

క॥ వాసవవందితపద, ప
ద్మాసన వినుతచరిత! ♦ యఖిలేశ యశో
వాస! పరాత్పర రఘువర
దాసావనపారిజాత! ♦ దశరథరామా! 31

మాలిని.

నయసుగుణ విభూషా ♦ నాకలోకేశపోషా!
నియతిసుకృతకృత్యా ♦ నిర్వికారా! బుధేశా!
జయజయనుతరూపా ♦ జానకీచిత్తచోరా!
భయజనధృతిరక్షా! ♦ పాహిమాంరామచంద్రా! 32

ఇది శ్రీహనుమద్దేవ దయారస లసత్కటాక్ష
కవితాధురీణ పంతము గోపనార్య పుత్ర
ఆంజనేయకవి కృత శ్రీ రుక్మిణీ
కళ్యాణమను కావ్యంబునఁ
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ రుక్మిణీ కల్యాణము

## పంచమాశ్వాసము.



జానకీశ పురహర
పూజిత సద్గుణవిశాల ♦ పురుషోత్తమ! భూ
రాజాధిరాజ రఘుపతి
రాజాన్వయ పారిజాత ♦ రామ నరేంద్రా. 1

వ॥ అట్లు సూతుండు నైమిశారణ్యమున శౌనకాది మునీంద్రులకు జెప్పెడిగతి శుకమునీంద్రుండు పార్థపౌత్రునితో నిట్లనియె. 2

చ॥ అనవుడు పౌండ్రకాదులును ♦ రారిజయంబునకోర్వలేకఁ జే
ధనువులఁ బూనిఘోటకర ♦ థంబులుమత్తకరీంద్రయుక్తులై
జనపతులెందరోతమకు ♦ సాయమొనర్పగఁ బోరఁ జొచ్చి రా
వనజదళాయతాక్ష బల ♦ భద్రులు సాత్యకితోడ నుద్ధతిన్.

క॥ అని సైన్యంబులుఁ గ్రమ్మగ
గనుఁగొని నేత్రముల నగ్ని ♦ కణములు రాలన్
ఘనమద గజముల మీఁదకుఁ
జను సింగములనఁగ బలుఁడుఁ ♦ జక్రియుఁ దాకెన్. 4

వ॥ ఇవ్విధంబున శ్రీకృష్ణుండు శిశుపాలుని, హలాయుధుండు జరాసంధుని, సాత్యకి పౌండ్రక దంతవక్త్రసాల్వాదులం దాకి ప్రళయకాలానల విజృంభమాణ పరాక్రమాభీల తేజులై పవనజవంబుఁగల రథరథ్యంబుల నుగ్గునూచం జేయుచు మహారుద్రుల చందంబున నెదిరించి మత్తకుంజరంబుల గండస్థలంబులరక్తంబుఁ జొనుపుచు గజారోహకుల విదళించుచుఁ బరిఘాయుధంబులు భస్మంబుసేయుచుఁ గుఠారంబుల ఖండించుచుఁ దోమరంబులఁ దూలించుచుఁ బ్రాసంబులఁ బట్టుచు మహారభసంబున దేవాసుర సంగ్రామ సన్నాహంబుమాడ్కిఁ దోచుచున్న సమయంబున వివిధ భేరీరవంబులుఁ జెలంగఁ దెగినమస్తకంబులును విరిగిన యూరుదేశంబులును బగిలన ఫాలంబులును విచ్ఛిన్నంబులైన నాసికంబులును విసంధులైన శరీరంబులును నలిగిన జానుదేశంబులును బ్రవస్సిన యురంబులును విరథులైన రథికులునుఁ బాఱెడి రక్తప్రవాహంబునఁ దెగిపడి బొబ్బలిడు మస్తకంబులును సాంద్రంబుగామహార్ణవంబేకార్ణవంబుగా వర్షించుగతి శరంబులఁ గురియుచు మహాభయంకర సంకుల సమరంబున.

చ॥ తనువులుఁదూలనేయుచునుదగ్ధయుసైన్యముమీఁది కేఁగుచున్
గనులను విస్ఫులింగములు ♦ గ్రక్కునరాలఁగ నట్టహాసముల్
బెనుగొన బాణముల్ వడిగ ♦ వేయుచుసాత్యకి కోపదీప్తుఁడై
యనినటుఁబౌండ్రకున్ గదసియద్భుతమొప్పరణంబుఁ జేయఁగన్

చ॥ తగు కవచంబుఁ జించి యుర ♦ దంబునుగూలఁగనేసియుద్ధతిన్
ఖగపతి సర్పమున్ గదిసి ♦ గర్వముఁ బాపియుఁ జంపురీతినిన్
దెగిపడు నట్టులాస్నృపతి ♦ దేహముఛిద్రములొందఁ జేయఁగా
దిగులునఁబోరుటల్విడిచి తేకువఁదప్పియువాఁడుఁబాఱఁగన్

చ॥ మఱియుజరాసుతుండుజనమాన్యుఁడునౌబలభద్రుతోడసం
గరమునుఁజేయఁగావిపుల ♦ కార్ముకమున్ ధరియించిబాణముల్
వరలఁగఁజేయ, రాముఁడును ♦ వాని విదల్చి హలంబుఁబూని త
చ్ఛిరమునవేయసొమ్మసిలి ♦ చెచ్చెరఁబఱ్వెడెఁ బాఱెభీతిచేన్.

వ॥ అంతకృష్ణుండు శిశుపాలుదెస రథంబుఁబోవనిచ్చి. 9

చ॥ నిలునిలు చైద్య! నీబిగువు ♦ నీవును నీదగుసైన్యమెంత! నే
గెలుతునుమూఁడులోకముల, ♦ క్రిందికిఁద్రొక్కెదభూతలంబునున్
జలనిధి నింకఁజేసెదను, ♦ సత్వరమా కనకాద్రి వ్రేలుపై
నిలుపుదు, నన్నుగెల్వఁగను ♦ నిర్జరు లోపఁగలేరు దుర్మతీ!!

వ॥ అనినవిని. 11

చ॥ పకపక నవ్విచేదిపతి ♦ బాహుమదంబున నోయదూద్వహా!
సుకరముగాదు నీకు; రణ ♦ శూరుఁడ ఖడ్గశరాసనాది సా
ధక నిపుణుండ నైన నను♦దార్కొన లేరిల నెవ్వరేనియున్
వికలము నొందుటల్విడిచి♦వ్రేతలఁ జేరుముపొమ్ముగోపకా!

క॥ అనియిటుల తూలనాడుచు
సునిశిత మార్గణము లేయు ♦ శూరతఁగని యా
మనుజాధిపుతో హరి యి
ట్లనియెన్ జిరునగవు మోము ♦ నందలరారన్. 13

మ॥ వినరా చైద్యనరేంద్ర! నేనిటనిదే ♦ విల్లంది యున్నాఁడ నీ
ఘనసామర్థ్యముఁ జూపరాయని నినున్ ♦ ఖండించి భూతాళికిన్
మనమింపొందఁగవిందుఁగూర్చెదనునీమాత్సర్యమున్ సాగునా?
మనఁగా లేవికఁగాలమున్ సమసె ర♦మ్మా! చావఁగా నెంచినన్.

వ॥ అనియిట్లు. 15

మ॥ తనవుల్నెత్తురుఁగారఁగా నిరువురు ♦ ద్యద్దీప్త బాణంబులన్
బెనగన్ వేయుచు దీయుచున్ జెలఁగుచున్ ♦ భేదించి కోదండముల్
ధ్వనిమార్విన్ గలుగంగఁ జేసి శరముల్ ♦ సంధించి పోరాడఁగన్
జననాథోత్తమ! రామ రావణ మహా♦సంగ్రామమై దోఁచెడిన్

చ॥ బలముల నెన్నుచున్ నిశిత ♦ బాణము లేయుచు దృష్టిఁ జక్కఁగా
నిలువుచు నిల్వునిల్వుమని ♦ నిర్భరవృత్తిని సింహగర్జనల్

జలుపుచుఁజక్రిచైద్యుఁడును♦సంగరరంగమునందు రుద్రులై
నిలుచుచుఁబోరఁగాదొడఁగె♦నిర్జర లోకము తల్లడిల్లఁగన్.

క॥ ఇరువురు సమబలవిక్రమ
వరులై పోరాడి విశిఖ ♦ వర్షముఁ గురియన్
జరిపిరి, వారల నేర్పున
కరుదొందుచుఁ జూడఁదొడఁగె ♦ నమరులు మింటన్. 18

క॥ విలసిల్లు వైష్ణవాస్త్రము
బలభద్రుని సోదరుండుఁ ♦ బౌరుషమతుఁడై
దలపడి యేయఁగ జైద్యుఁడు
బలముడిగియుఁ జాపఁదొడఁగెఁ ♦ బార్థివముఖ్యా! 19

వ॥ ఇట్లు శ్రీకృష్ణపరమాత్మునిచే విడువంబడిన వైష్ణవాస్త్రం
బున వెడలిన మహాగ్నిజ్వాలలకు నిలువంజాలక రణస్థలిని
విడిచి నిఖిలభూపతులు చేదిపతిసహితంబుగా హతశేష
మగు తమ తమసైన్యంబులఁదోడ్కొని నిజ నివాసంబుల
కుంజనిరి. పిమ్మట రుక్మి ప్రచండుడై వాసుదేవుని రథంబున
కెదురుగాఁ దనరథంబునుం బోవనిచ్చి. 20

చ॥ కలవరమొందుసైన్యములగన్గొని ధైర్యముగొల్పియంతటన్
నిలునిలుమాధవా!యిదుగో ♦ నేఁజనుదెంచితిరమ్ము మద్భుజా

బలమది యెట్టిదో తెలియ ♦ వచ్చును దుర్బలకోటిమీద నీ
చలమును జూప నెంచితివె! ♦ సాగునె! రుక్మినెదిర్చి పోరఁగన్

ఉ॥ ఆకులు కాయలన్ దినుచు♦నద్రులయందు చరించుగొల్లవై
భీకరమూర్తి వోలె నిట♦భీష్మకు రాజ్యముఁ జొచ్చి రుక్మిణిన్
దేకువఁ దప్పి తీసుకొని ♦ తెంపరివై యెటుబోవ నెంచెదో
పోకిరి! రుక్మిణిన్ విడిచి♦పొమ్ము మదస్త్రము చేతఁ జావకన్.

క॥ చతురంగ బలముతోడను
జతురత వచ్చితిని రణము ♦ సల్పఁగ నీతో
మతి బాలుఁడనుచు నన్నవ
మతిఁ జేయకఁ బోరరమ్ము ♦ మాధవ! కినుకన్. 23

ఉ॥ గొల్లలయింటఁ బుట్టితివి ♦ కూళతనంబున సిగ్గుమాలి మా
పల్లవపాణి రుక్మిణిని ♦ పౌరుషహీనుఁడవై హరించుటల్
చెల్లునె! నీకు నీకుటిల ♦ చేష్టలమాన్పెద! యుద్ధమందు నిం
ద్రెల్లఁగ సేయువాఁడ నని ♦ తీవ్రశరంబుల నేయనెంచినన్

గీ॥ అంత మాధవుఁడా రుక్మి ♦ నట్టెఁ జూచి
బాలుఁడవు నీవు నాతోడ ♦ బవరమాని
నిలువఁగాలేవు నీవేల ♦ నిర్జరాది
మేటిబలులైనఁ జోరాడి ♦ మించఁ గలరె! 25

వ॥ అదియునుంగాక నీతోడిసహచరులగు సాల్వ జరాసంధ పౌండ్రిక శిశుపాల నృపులును, తత్సైన్యంబులును మచ్ఛ రాహతి కోర్వఁజాలక విముక్తకేశులగుచు బరాజితులైరి. ఇదియెఱింగి సమరంబునకు రాఁదగునె! సంగ్రామంబున కర్హుండవుగావు కావున నీయందు నాకువైరంబులేదు. సమరక్రియ లెఱుంగని కర్జ్ఞుఁడవు, సుఖంబుగఁ దలిదం డ్రుల డాఁడనుండుపొమ్ము శీఘ్రంబన. 26

క॥ అనిపలికిన హరిపలుకులు
మనమునఁ జర్చింపక మిత ♦ మదమత్సరుఁడై
కనలుచు హరిదెస రథమును
జనఁజేసియు నిటులఁబలికె ♦ రుక్మానాథవరా! 27

క॥ హరి నీవు నీదుమాయనుఁ
బరికింపఁగ నాదుమోల ♦ బరపకు వినుమా!
దురమందు నీదుబలములఁ
బఱుఁగెత్తఁగఁ జేయువాఁడ ♦ బంకజనాభా! 28

వ॥ అని కోదండపాణుండై ఘనాఘన గర్జితంబులట్ల జ్యాఘో షంబులొనర్చుచు రుక్మి క్రోధారుణ వీక్షణుండగుచు శర పరంపరల రోదసీకుహరమండలంబున జెల్లుంగప్పిన వాసు దేవుండవియన్నియు నివారించి యొక్కబాణంబున నారా

కుమారుని శరాసనంబుఖండించిన నంతవాఁడా భగ్నంబగు చాపంబువిడిచి వేరొండుధనువుంగొని నిశితంపుటంపగముల నిగుడించిన. 29

గీ॥ వానినెల్లను ఖండించి ♦ వాసుదేవుఁ
డతని రథము రథ్యంబుల ♦ నంతమొందు
మార్గణంబులనేసిన ♦ మండివాఁడు
వేఱురథమునుఁ గైకొని ♦ పోరుచుండ 30

క॥ హరినాగాస్త్రము గేలం
బరగఁగొని వైవనదియు ♦ భాస్కరులీలఁ
ధర విషమునుఁ గ్రక్కుచునని
కరచరణములొడసిగట్టై ♦ గదలక రుక్మిఁ 31

వ॥ ఇట్లు సర్వశత్రుబంధనంబగు పన్నగాస్త్రముచేతఁ గట్టువడి రుక్మిని శ్చేష్టుఁడై యుండ, శ్రీహరి రుక్మిణీప్రార్థనంబంగీకరించి వానింజంపక గడ్డంబును మీసంబును దలయునుం గొఱిగి విరూపుంజేసి యిక నీపురితో వంబట్టి పొమ్మనిన, బలభద్రుండు జాలింగొని త్వరితంబుగ నారుక్మిరథంబునం జేరి యవ్వానిని బంధవిముక్తుంజేసి విడిచిపుచ్చి శ్రీహరి నింగనియిట్లనియె. 32

క॥ చుట్టంబుల దలమూతుల
కట్టా గొఱుగంగఁ దగునె ♦ కమలాక్ష! ధరన్
బట్టియు జంపుటకన్నను
జెట్టగదా వానినటులఁ ♦ జేయుట కృష్ణా! 33

క॥ పగ చెలిమియు నీకిలలో
నగధర! సమమయ్యునిటుల ♦ న్యాయమెనీకున్
దగురీతి రుక్మినను పక
వగపొందఁగ జేయదగునె ♦ వారిజనాభా! 34

వ॥ అనియిట్లు బలభద్రుండు శ్రీకృష్ణునితర్జించుచు రుక్మిణీదేవినింగాంచి, తల్లీ! భవత్సహోదరు భంగంబునుం గూర్చి వగచెదవేల; సమస్త ప్రాణులకు సుఖదుఃఖంబులవశ్యభోక్తవ్యంబులు నీయగ్రజుఁడు పరమకల్యాణ గుణాభరణుండగు గోవిందునిచేత విగత కల్మషుండయ్యెనని దుఃఖోప శమనంబుఁజేసి పిమ్మట. 35

చ॥ అనుజులు బంధువుల్సచివు♦లాప్తులుమిత్రులు సంతసింప మేదిని నవపుష్ప వర్షములు ♦ దేవతలుం గురియింప దుందుభిస్వనముచెలంగ భూసురులు♦స్వస్తివచః పఠనంబు సేయఁగా దనుజహరుండు శ్రీహరిము♦దంబునఁ జేరెను ద్వారకాపురిన్.

వ॥ ఇట్లుచనుదెంచి తలిదండ్రిలకును నిఖిలబంధు గురుపురో
హిత పండితప్రవరులకు వందనంబులనాచరించి యొకశుభ
ముహూర్తమునందు. 37

సీ॥ భూసురాశీర్వాద ♦ ములు జేయుచుండంగ
వందిమాగధులు కై ♦ వారమొసఁగ
గర్గాది మునులెల్ల ♦ గౌతుకంబునఁ జూడ
సామంత రాజులు ♦ సన్నుతింప
బంగాళ నేపాళ ♦ పాంచాళ నృపవర్యు
లాంధ్రి దేశాధిశు ♦ లభినుతింపఁ
బుణ్యాంగనామణు ♦ లొప్పసగ నారతులీయ
బంధువర్గంబెల్ల ♦ బలసికొలువ

గీ॥ కనకనిర్మితరత్న వి ♦ రాజమాన్య
మహిమఁ జెన్నొందు కళ్యాణ ♦ మంటపమునఁ
శేరి కృష్ణుండు భూసురు ♦ చిత్తమరసి
ప్రీతిఁ గూర్చుండె లగ్నంపు ♦ పీఠమందు. 38

సీ॥ భవ్యరాణి సారస ♦ భవురాణియుంగూడి
మంగళహారతుల్ ♦ మరినొసంగ
శివుఁడు దెచ్చియునిచ్చె ♦ శివ శివాంకితమైన
రుద్రాక్షమాల ని ♦ రూఢిమోయ

నజుఁడొసంగెను భక్తి ♦ నమర పూజితమైన
మణికంకణంబులు ♦ మాధవునకు
వరుణుండు నొసఁగెను ♦ సురలకలభ్యమౌ
రత్నహారము రమా ♦ రమణునకును
గీ॥ సురలు నరులును నొకరీతి ♦ హరికిఁ గాను
కర్పణముఁజేసి రా వేళ ♦ నద్భుతముగ
వెలఁగి కృష్ణుండు నయ్యవి ♦ స్వీకరించి
సంతసిల్లుచునుండె నా ♦ సమయమందు. 39

ఉ॥ అంతట రుక్మిణీమణిని ♦ నంచితపుష్ప సుగంధ దేహినిన్
వింత విభూష ణావళుల ♦ వేడుక మీఱ నలంకరించి య
త్యంతముదంబునుంగొలువు ♦ నట్టిమృదంగపు కాహళధ్వనుల్
కాంతలు వెంట రాఁగఁగుతు♦కంబునఁదోడ్కొనివచ్చి రెంతయున్

సీ॥ నీలవర్ణంబున ♦ నిగుడు పెన్నెరవేణి
కాంత నెన్నడుమునఁ ♦ గ్రాలుచుండఁ
గర్ణయుగ్మంబునఁ ♦ గాంతిలు వజ్రాల
తళుకు కమ్మల దీప్తి ♦ దనరుచుండ
గబ్బి గుబ్బలఁగుల్కు ♦ కంగుల రవికపై
రత్నాలహారముల్ ♦ రాణఁ జెంద

రంగారు బంగారు ♦ చెంగావి నునుఁజీర
కుచ్చెళ్లు మీఁగాళ్లఁ ♦ గూర్మి నెనయ

గీ॥ కనక మంజీరములు పాద ♦ కమలములకు
వన్నె నొకకొంతఁ గొలుప నా ♦ వనజనేత్రి
సిగ్గు దళుకొత్తు చూపుల ♦ సిరులు గులుక
నబల కళ్యాణవేదిక ♦ కరుగుదెంచె. 41

క॥ తెరఁబట్టిరపుడు శ్రీహరి
వర రుక్మిణి నడుమ నంత ♦ వారిజనేత్రుల్
ధరణీ దేవత లప్పుడు
పరమంబగు ప్రీతి వేద ♦ పఠనము జేయన్. 42

క॥ సిరులలరెడి చిరునగవునఁ
దరుణీమణి శిరమువంచె ♦ దగుగతి సిగ్గున్
భరమయ్యెనో యనంగను
ధరణిపయిన్ జూడ్కినిలిపె ♦ తత్సమయమునన్ 43

ఉ॥ తల్లియుఁదండ్రియున్ హితులు ♦ దగ్గర జేరియుఁ బెండ్లిపీఠమం
దుల్లము మోద మొందుచును ♦ నుండెడి మాధవు భోజకన్యపైఁ
జల్లిరి సేసలున్ గుసుమ ♦ సంతతి, కృష్ణుఁడుఁ గట్టె రుక్మిణీ
పల్లవపాణి కంఠమున ♦ భాసిల మంగళసూత్ర మంతయున్.

మ॥ చెలువొందన్నిజపాదనూపురములున్ జెల్వొందుచుండన్ ధ్వ
బలుమారుం గని రుక్మిణీమణి మదిన్ ♦ భావింపలజ్జన్, ద్వరన్ న్రుల్
నళినీనేత్రుఁడు, పాయఁజేయఁగను నా ♦ నారీ పదాబ్జంబు ప
జ్జలజాతంబునఁ గప్పెఁ జక్రిపద ని ♦ ష్ఠన్ బెండ్లికాలంబునన్.
చ॥ మనమలరార మాధవుని ♦ మానిత రుక్మిణి లోలనేత్రినిన్
ఘనులగు భూసురోత్తములు ♦ గానఁగ దోడ్కొనిపోయి మిన్నులం
దనరెడి యాయరుంధతి ము ♦ దంబునఁ జూపిరి చూపి పిమ్మటన్
ఘనముగ మ్రొక్కఁజేసిరట ♦ గంజదళాక్షుని తల్లి దండ్రికిన్.
గీ॥ లెక్కలేనట్టి దేవుళ్ల ♦ మ్రొక్కి మ్రొక్కి
విసుగుఁ జెందిరి కాని యా ♦ విప్రవరులు
విసుగుఁ జెందరు దక్షిణా ♦ వేశులగుచు
మ్రొక్కఁజేతురు నడుములు ♦ మోరుఁగట్ట. 47
ఉ॥ అంతట నైదునాళ్లును మ ♦ హావిభవంబుగ బంధులందర
త్యంతముఁ బ్రీతితోడఁ దని ♦ వారఁగ భోజన భాజనంబులన్
సంతసమొంద, గంకణ వి ♦ సర్జనఁ జేయఁగ జేసి రుక్మిణీ
కాంత నలంకరించిరట ♦ కాంచన రత్నసుభూషణంబులన్.
వ॥ ఇట్లలంకరించుచుండెడితరి. 49
మ॥ తళుకుం బంగరు మేడలోపలను ని ♦ ద్దావ్రజముల్ గల్గి డం
బుల మేల్దంతపుఁ బట్టెలుం గలిగి సొం ♦ పుల్ మీరి రాజిల్లు రా

చిలుకల్ గూర్చినకోర్కె యందమలరన్ • జెల్వొందుమంచంబుపైఁ
జెలువొప్పారెడి పాన్పునన్ హరివసిం • చెన్ బ్రేమ రెట్టింపఁగన్

గీ॥ అంత రుక్మిణిఁ దోడ్కొని • యనుగు చెలులు
భాసురంబుగ గేళికా • భవనమునకుఁ
జేరి రంతట హరికిని • జిత్తమందు
నిముస నిముసంబు యుగమునై • నెగడుచుండ. 51

వ॥ అంత నెచ్చెలులు రుక్మిణీదేవినింగాంచి 52

క॥ ఎలనాగ! నీవుకోరిన
చెలువుఁడు నీకబ్బెనింకఁ • జిత్తమునన్ బె
గ్గిలియుండకు మదనకళా
కలితంబగు లక్షణములఁ • గలయుము కృష్ణున్ 53

సీ॥ శ్రీహరి కేల్వట్టి • సెజ్జకు దిగిచిన
బెనగాడగారాదు • బిసరుహాక్షి!
కప్పురంపు వీడెముల్ • కలికి! కాంతుఁడొసంగ
మొగముఁ ద్రిప్పఁగరాదు • మోహనాంగి!
కస్తూరి గంధముల్ • గాంత! నీచనుదోయి
నలదనెంచిన గృష్ణుఁ • డలగకమ్మా!
ప్రియుఁడు నీ నెరికొప్పు • ప్రేమవిరుల్ నింపఁ
గరలఁగాఁ దప్పది • కీరవాణి

గీ॥ మనసుఁ గనిపెట్టి మగనితో ♦ మరలు కొనఁగ
వలయుఁగావున విసికింప ♦ వలదుసుమ్మ!
పతియె దైవంబు సతులకుఁ ♦ బద్మనేత్రి!
తెలుపఁ గలవన్ని నీతోడఁ ♦ దెలిపినాము. 54

ఉ॥ అంటిమిగాని మాధవుని♦యందలి నీయనురాగ మంతయుం
గంటిమికాదె మున్ను! బుధ♦గణ్యుని నీవటఁబిల్వనంపు బ
ల్దంటవుగావె! సూనశర ♦ ధాటికిఁ జిక్కఁగనీకఁ గృష్ణుఁ; వా
ల్గంటిరొ! నేలుమాయిపుడు♦ కాముకు కేళినిఁ దేల్చి కామినీ.

ఉ॥ కన్నియ! నీవు రాజకుల ♦ కాంతవు చిన్నతెఱుంగ నేర్తు! మా
వెన్నుఁడు మంకుగొల్లపృథి♦వీ మరియాద తెఱుంగలేడు నీ
వన్నెలకుఁ సమానము గు ♦ వన్నెలు నేర్వని పింఛధారి, నే
మన్నను నోర్చుకోవలయు ♦ నమ్మ! మానంబున రుక్మిణీమణీ.

కం॥ సూటిగఁదా బరిహాసపు
మాటల నాడంగ వేరు ♦ మానిని యపుడా
బోటినిఁగని యెంతటి
చేటివె! నీనేర్పుఁ జూడఁ ♦ జిత్రముఁ దోచెన్ 57

కం॥ పదియారు వేలగోపిక
మదవతులన్ దగులుకొన్న ♦ మాధవు నెంతో

ముదమునఁ దెలియనివానిఁగ
జనువంగాదగునె! రతివి ♦ శారదుఁడరయన్. 58

గీ॥ సిగ్గుచేనిండి తలవాల్చి ♦ బెగ్గడిలెడి
భోజకన్నియఁ దోడ్కొని ♦ భుజగశయనుఁ
జేర్చి చిరునవ్వు లలరుచుఁ ♦ జేటి యొకతె
యింపుదళకొత్త హాళితోడ ♦ నిట్టులనియె. 59

గీ॥ చల్ల లమ్మెడి ప్రేతల ♦ సరణి నీవు
రాచకన్నియ రుక్మిణీ ♦ రాజ వదనఁ
బోల జూడకు మీాలేమ ♦ పుష్పగంధి
మాట మర్యాదఁగని పెట్టి ♦ మరులుఁగొలుపు. 60

చ॥ అనియిటునచ్చ జెప్పియును♦రాఁిపదంబుల ప్రొక్కఁ జేసివే
డ్కను హాళిప్రాల సెజ్జకడఁ♦గామిని నుంచియుఁ గృష్ణ! రుక్మిణీ
వనజదళాయతాక్షిని న ♦ వారిత ప్రేమను నేలుకొమ్ము కొ
మ్మని తగనప్పగించి పని♦యన్ మిమఁజూపి తొలంగిఱందరున్.

క॥ మెల్లఁగ బాన్పున రుక్మిణి
పల్లవదళపాణిదిగిచి ♦ భాసురమ్మృదు ధ
మ్మిల్లంబును నిమిరియు రం
జిల్లుచుఁ బలుకందొడంగె ♦ శ్రీహరి ప్రేమన్. 62

సీ॥ గజనిమ్మ పండ్లునాఁ ♦ గానవచ్చెడి నీదు
కుచము లంటఁగనిమ్ము ♦ కుసుమగంధి!
యలవిద్రుమములునా ♦ యనఁగఁ దోఁచెడినీదు
పెదవి ముట్టఁగనిమ్ము ♦ బిసరుహాక్షి!
మృదులతాదులఁబోలు ♦ మృదువొప్పచుండు నీ
కరములఁ బెనయవే ♦ కంబుకంఠి!
నీలోత్పలంబుల ♦ నెనరుఁజూపెడినీదు
కనులఁ దేలింపవే ♦ కమలపాణి!

గీ॥ యనుచు దరహాస వదనుఁడై ♦ యబ్జనేత్రుఁ
డలరి యానాతికుచముల ♦ నలరు మోవి
గలికి చెక్కిలి పిరుదులు ♦ గనులు బొమలుఁ
గేల నిమురుచు మరుకేళి ♦ బాలఁగూడె. 63

చ॥ మనసిజబారిఁజిక్కితిని ♦ మానిని! ధర్మమె! రమ్ముప్రీతిమై
బెనగొని మోవిపానకము ♦ ప్రీతివహిల్లఁగ నిచ్చియంతటన్
జనులనుబట్టనిమ్ము వెసఁ ♦ జౌసితి రీతులసొక్కి దంతము
ల్మొనయఁగనొక్కి హాయిగనుముచ్చటలాడెదరావెకోమలీ!

క॥ అనిబుజ్జగించి నేర్పున
వనజాక్షుఁడుదరికిదిగిచి ♦ వనురహ నేత్రి

మనములరారఁగనంతటఁ
వనజాస్త్రుని కేళిఁ దేల ♦ భాసిలు మతుఁడై. 65

గీ॥ తళుకు జెక్కుల ముద్దిడి ♦ ధవళనేత్రి
నీవి సడలించి రతిశాస్త్ర ♦ నియతి యధర
సుధలఁ గ్రోలుచుఁ గుచముల ♦ జొక్కి పట్టి
యతుల రతులను గరగించె ♦ నబ్జముఖిని. 66

ఉ॥ అంతర తాంతమందున ము ♦ రారియునంకమునందు రుక్మిణిన్
సంతసమొందనిల్పి విరి ♦ జాజులు వేణిరచించి క్రొమ్మెఱున్
వింతగు మేలుచందనము ♦ విప్పగు చన్నులనద్ది మేలిమా
మంతనమందు నాసుదతి ♦ మానసమున్ గరగించె నేర్పునన్!

ఉ॥ అంతట నంబుజాక్షుఁడు ప్రి ♦ యాంగన రుక్మిణి నొక్కనాఁడు దా
మంతన మందుఁ జేరి కుసు ♦ మంబులఁ గీల్జడఁ జుట్టి, మానినీ
వింతలఁ గొల్పు దేశముల ♦ వేడ్కఁ దలిర్పఁగఁ జూపువాఁడ నా
గాంతకు నెక్కి వచ్చెద వె ♦ యన్న మదిన్ ముద మొందె నంతయున్.

క॥ హరియును భోజాత్మజయును
మురిపంబున నెక్కి గరుడు ♦ మూఁపురమంతన్
గరువలితీవ్రత కన్నను
త్వరితంబున మింటకెగసెఁ ♦ దార్క్ష్యుఁడు వడితోన్. 69

సీ॥ నందసుతు తోడ శార్ఙ్గంబు ♦ నందకమ్ము
గదయుఁ జక్రంబు శంఖంబు ♦ కౌతుకమున
వెంటఁ బోవఁగ మింటను ♦ వేల్పులంత
కృష్ణ! తుభ్యంనమో యంచుఁ ♦ గేలుమోడ్చి. 70

క॥ హరిసురల వినతికెంతయు
దరహాసముఁ జూపి మింటఁ ♦ దరుణీమణితో
మురిపంబు గదుర నిట్లను
సరసంబగు వచనరచన ♦ చాతురి మెరయన్. 71

ఉ॥ అంబుజనేత్రి! చూడుమట ♦ నద్రివరేణ్యము మేరుశైలమున్
సాంబునిఁ గొల్చు సిద్ధులును ♦ శక్రపురంబున నుండువారు మో
దంబున శృంగ భాగముల ♦ దక్షవిరోధి సుగీత జాలమే
చందముఁ బాడఁగాఁ దొడఁగె ♦ శైలములం గరుగంగఁ జేయుచున్

సీ॥ అమరధేనువు పాలు తా ♦ మారగించి
కల్పవృక్షమ్ము ఛాయలఁ ♦ గాంత! నిలచి
సిద్ధులేరీతి రజతాద్రిఁ ♦ జేరనేగు
చున్నవారలో, కనుఁగొంటె ♦ సుదతిమిన్న! 73

సీ॥ వీరె విద్యాధరుల్ చూడు ♦ విద్రుమోష్ఠి
కలిత మాణిక్య కుండల ♦ ములనుఁ దాల్చి

వెలయుచున్నారు సంగీత ♦ విద్యలందు
బేరుగాంచిన మేటిప్రి ♦ వీఁకలరయ. 74

మ॥ కనుఁగొంటేవిమ తేందురాజముఖియిూగంధర్వబృందంబులా
ఘనపద్మాసనుమీద గీతరచనా ♦ కావ్యప్రసంగంబులం
దున పాత్రీవిజ్ఞల, మందహాసులహరి♦స్తోత్రాత్ముల్కర్ నిర్జరీ
జనితానందసునృత్యకోవిదులయ ♦ తుగాత్రమవాస్తవ్యులక్.

సీ॥ యక్షులగంటివె ♦ యతివ! వీరలునురే
శ్వరుసభాస్థలిఁ జూడు ♦ వారలెప్పుడు
గుహ్యకుల్వీరలో ♦ కోమలి! భృంగిశు
నర్మసఖుల్ చూడు ♦ నాతిమిన్న!
గరుడులు వీరలో ♦ కమలాక్షి! నాగారి
పరమమిత్రులు మహా ♦ బలులుచూడ
చారణుల్వీరలో ♦ సతి! విచిత్రపుగాధ
లరయఁజెప్పఁగనేర్తు ♦ రమరపురిని

గీ॥ సరసమతులయ్యు నిందుప్రి ♦ సభను నెప్పుడు
బరమకళ్యాణముంగూర్చు ♦ భవ్యమతులు
వీర లేసుమ్ము మనలను ♦ వేడ్కమీరి
చూచుచున్నారు కంటివే ♦ సుందరాంగి! 76

ఉ॥ అచ్చరలేమలన్ గనుమ ♦ యంబుజనేత్రిరో! వారెనీకు బ
ల్మచ్చట గూర్పనాదివిజ ♦ పూజ్యతనొప్పెడి పారిజాతముల్
మెచ్చుచుఁ దెచ్చుచుండిరదె ♦ మేలుముదంబున వేల్పుటావు దా
వచ్చెనుక్షీర మీయఁగను ♦ భామిని గైకొనిగారవించుమా. 77

చ॥ కనక మహీధరేంద్రమునఁ ♦ గానఁగ వచ్చెడి పట్టణంబదే
యనిమిషరాజధానియట ♦ నధ్వరమేల్చిన యాజకోత్తముల్
అనిమొనఁ ద్రెళ్లువారలును ♦ నాపురిసౌఖ్యము లెల్లఁ బొందుచున్
దనరుచు నుందురెప్పుడును ♦ దవ్వులఁ జూడుమ వారె! రుక్మిణీ!

గీ॥ కమలనాభుండు రుక్మిణీ ♦ కమలనేత్రి
గరుడవాహనమెక్కియు ♦ గగనమార్గ
మునను చనుదేర జంభారి ♦ ముదముఁ దోప
జనియుఁ దోడ్తెచ్చె రంభాది ♦ సతులుఁ గొల్వ. 79

వ॥ అట్లు సురేంద్రుండు నూత్నవధూవరులగు శ్రీరుక్మిణీవాసు
దేవుల సత్కరించి పిదప. 80

ఉ॥ సంతసమొందికృష్ణపద ♦ సారసయుగ్మము మీఁదవ్రాలిజం
భాంతకుఁ డుండగాహరిసు ♦ రాధిపుఁ గౌగిటఁ జేర్చి, యింద్ర! నీ
చెంతవసించు దేవతలు ♦ చేరియు నిన్ భజియింతురే! దిశా
కాంతులు మేనకాదిగణి ♦ కానివహంబులు నిన్నుఁ గొల్తురే!

సీ॥ అనుచు బ్రశ్నింప నింద్రుండు ♦ నాత్మనలరి
యంబుజోదర! నీదయ ♦ యమరియుంట
లోపమున్నదెనాకునో ♦ లోకరక్ష
భక్తమందార! గోవింద! ♦ ప్రణవరూప! ౪౨

ఉ॥ ఈశ! చరాచరప్రతతి ♦ కెల్లిసముద్భవ నాశసస్థితుల్
చేసెడియాదిమూర్తి, నిను ♦ శ్రీగళపద్మభవాది నిర్జరుల్
భాసిలిమెల్లప్రొద్దులను ♦ భక్తినుతింతురుగాదె కృష్ణ! నీ
తోసమమెవ్వరీజగతి ♦ తోయనివాస! పరేశ! మాధవా!

మ॥ జయలక్ష్మీధవ! నీవొసంగిన వెమ ♦ త్సామ్రాజ్యభోగంబుల
న్నియు, నీపోషణఁగాదె నేమనుటయుఙ్ ♦ నీరేజపత్రాయతా
క్ష! యదూత్తంస! మునీంద్రమానసనివాసా! కృష్ణ! గోపాలశ్రీ
జయవారాన్నిధి! భక్తపోషణభవద్దాస్యార్థుఁడఙ్ మాధవా!

వ॥ అని యిట్లింద్రుండు సిద్ధచారణ గరుడగంధర్వ విద్యాధర నిఖిలదేవాదులంగూడి శ్రీరుక్మిణీ వాసుదేవులకు బునఃపునః ప్రణామంబులాచరించిన, గోవిందుండుకరుణాకటాక్షంబున వీక్షించి, ప్రభులక్షణ లక్షితంబులగుగంభీరవచోగుంభనంబుల, ఇంద్రా! నీభక్తికినెంతయుమెచ్చితిని. అనవరతమభ్యుదయపరంపరాభివృద్ధిగా వర్థిల్లి సురపురంబును పాలించుమని సురేంద్రుండొసంగిన గాన్కల గౌరవించి

గరుడవాహనారూఢుండై రుక్మిణీసహితంబుగా ద్వారకా నగరంబునకుఁజని క్రమక్రమంబున అష్టభార్యా కరగ్రహణుండయి పదియారువేల గోపికలకు నిజలీలావైభవంబున బ్రహ్మానందంబొసంగుచు, ధరాతలంబున ధర్మసంస్థాపనార్థమై పెక్కండ్రుకుమతులనుక్కడంచుచు పోద్ధశాస్త్రబంధుజనసహితుండై శ్రీకృష్ణుండు సత్యసద్గుణశీలుండై మాయాసమన్విత లీలామానుష విగ్రహవిలాస తారక బ్రహ్మనామాన్విత తేజోమయుండై, రక్త నీల పీత విశాగ విషయాతీత నిర్గుణ పరిపూర్ణుఁడై ప్రకాశించుచుఁ బ్రజలంగాపాడుచు ద్వారకావాసుండై సంతత భక్తజనవరదుండై శుభంబుననుండెను. 85

క॥ అనుదినము భక్తిశ్రద్ధల
జనులెవ్వరయిన దీని ♦ జదివిన వినినన్.
వనజాక్షుఁడొసఁగు వారికి
ఘనమగు నిహసుఖము తుదినిఁ ♦ గైవల్యమునన్. 86

క॥ అనియిటులశుకుఁడుపరీక్షి
జ్జనపతికిన్ దెలుప, భక్తి ♦ జ్ఞానపతిశ్రద్ధన్
విని శాశ్వతకైవల్యముఁ
గనియెన్ నిర్జరులుమదినిఁ ♦ గాననివథమ్మున్. 87

క॥ భవధనుఃకార్ముక విదళన శ్రీ
ధవ! హరి! సుత్రామవినుత! ♦ దానవవైరీ
శివజపిత మంత్రతారక!
భువిశ్రిత మందార! రామ! ♦ భూపలలామా! 88

భుజంగప్రయాతము.

సురానేక సంరక్ష ♦ సూక్ష్మస్వరూపా!
ధరాజాతచిత్తాబ్జ ♦ ధామా! రమేశా!
పరాదేవదేవా! శి ♦ వస్తోత్రపాత్రా!
మురారీ! హరీ రామ! ♦ మోక్షప్రదాయా!

ఇది శ్రీహనుమద్దేవ దయారస లసత్కటాక్ష
కవితాధురీణ పంతము గోపనార్య పుత్ర
ఆంజనేయకవి కృత శ్రీ రుక్మిణీ
కళ్యాణమను కావ్యంబునఁ
పంచమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీసీతారామ చంద్రార్పణమస్తు.



# శ్రీ రుక్మిణీ కళ్యాణాంతర్గత

## —: తత్త్వార్థ ప్రకాశిక :—

శ్లో॥ కృష్ణేతి మంగళంనామ యస్యవాచప్రవర్తతే
భస్మీభవంతు రాజేంద్ర మహాపాతకకోటయః॥

శ్లో॥ సంసార సర్పసందష్ట చేష్టైక భేషజమ్
కృష్ణేతివైష్ణవం మంత్రంశ్రుత్వాముక్తో భవేన్నరః॥

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం ।నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

అనెడి ఆచార్యోక్తిచేత సత్పురుషసాంగత్యమున నుత్తమగుణములచే నలంకరింపబడి విజ్ఞానమునుఁగాంచినబుధులు రాగద్వేష నిర్ముక్తులగుదురు.

ఋషిప్రోక్తములగు నిఖిలపురాణేతిహాసములలో నాత్మానాత్మవిచారణ గూఢముగాజెప్పబడియున్నది. అయ్యది గమనించక కొందరుపురాణముల గలనయ్యాయి కథాఘట్టములు కేవలకల్పితములని ధిక్కారముజేయుచు నిరభిమానముగలవారలై యున్నవారలు.

విద్యలెన్నినేర్చినను బ్రహ్మవిద్యతో సమానముకావు గావున శ్లో॥ అన్యవిద్యాపరిజ్ఞానం, అవశ్యంనశ్వరంభవేత్ । బ్రహ్మవిద్యాపరిజ్ఞానం, బ్రహ్మప్రాప్తికరంపరం॥ అనెడినార్యోక్తిననుసరించి కించిజ్ఞుఁడనైననేను నాస్వల్పవిద్యాపరిశ్రమమున, బుద్ధిమంతులగు పెద్దలసేవఁజేసి, వారియుపదేశములయొద్ధభిమానవరుండనై పడసిన విజ్ఞానబలమున నాచేరచియింపఁబడిన శ్రీరుక్మిణీకళ్యాణమునఁగల నంతరార్థమునా నేర్పుకొలది వ్రాయదొడంగితిని. అయ్యది పరతత్త్వజిజ్ఞాసుల కుపకరించఁగలదని నాఅభిమతము.

## కథాప్రారంభము

పవిత్రమైన మనుష్యదేహమనెడి విదర్భదేశమును వేదశాస్త్రపురాణేతిహాసములు బహుముఖములుగ బ్రహ్మత్వమును ప్రతిపాదించుచుండ, చలనమును పొందక నయ్యవి సమన్వయముసు జేసుకొని, శ్లో॥ వేదైశ్చసర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవచాహం॥ అను భగవద్గీతప్రమాణముచేత స్వస్వరూపజ్ఞానముఁగల్గి బ్రహ్మము నేనే యని స్థిరపఱచుకొని హృదయమనెడి కుండిన పురంబున నివసించి, అజ్ఞానావరణవిక్షేపాదులకెల్ల భయంకరుఁడును, వానినన్నిటిని నశింపఁజేయఁగల సమర్థుఁడునైన భీష్మకుఁడను బ్రహ్మవిద్వరిష్ఠుండగు నృపుండు పరిపాలించుచుండెను.

2. ఆబ్రహ్మవిద్వరిష్ఠుండగు భీష్మకునకేంబ్రివకు పంచమలములనెడి యేవురుపుత్రులును జ్ఞానమనఁబడు రుక్మిణియనెడి కూతురుంగల్గెను. రుక్మిణీయనగా, రుక్మమస్యాస్తీతి రుక్మిణీ=సువర్ణమనియర్థము. శ్రుతి॥ తత్సువర్ణగం హిరణ్యమభవత్, తత్సువర్ణస్య హిరణస్యబ్రహ్మేతి॥ అను శ్రుతిప్రమాణానుసరణి. హిరణ్యమనఁగా పరబ్రహ్మము ఆపరబ్రహ్మము దెలియజేయునది బ్రహ్మవిద్య గనుక రుక్మిణి యనఁగా బ్రహ్మవిద్యలేక ముక్తికాంత.

3. స్వాతిరిక్తవస్తు సత్యజ్ఞానవృత్తిని వర్ధిల్లఁజేయునట్టి అజ్ఞానమును, స్వాతిరిక్తసత్యజ్ఞాన శూన్యమైన బ్రహ్మజ్ఞానమును మనస్సునందే పుట్టుటవలన అజ్ఞానమునకు బ్రహ్మజ్ఞానముతోఁబుట్టువనంబఱగు ఆయజ్ఞానరూపకములగు పంచమలములే బ్రహ్మజ్ఞానమగు రుక్మిణీదేవికి అయిదుగురుదోఁబుట్టువులయిరి. మరియు అజ్ఞానము తొలతబుట్టి సద్గురుబోధవలన బ్రహ్మజ్ఞానము వెనుకగల్గెను కావున అజ్ఞానరూపకుఁడగు రుక్మి అన్న యనియు బ్రహ్మజ్ఞానరూపిణియగు రుక్మిణీదేవి చెల్లెలనియు నెఱుఁగనగును.

4. ఆణవ, కార్మిక, మాయిక, మాయేయ, తిరోధానములనునవియే పంచమలములు. ఆణవమనగా నేను బ్రహ్మమనెడి విజ్ఞానమప్పుడప్పుడు తటస్థించగానయ్యది మఱుగుపఱచి వ్యాతిరిక్త వస్తు సత్యజ్ఞానమును కల్గజేయునది. కార్మికమలమనగా వేదాంతమహావాక్యార్థములు సద్గురువులుబోధించఁగా వశ్రద్ధవహింపఁజేయునది. మాయికమనగా బ్రహ్మజ్ఞానవాసన నుదయింపనీయనది. మాయేకమనగా పాపపుణ్యములు చేయుటయందు మనస్సును ప్రవేశింపజేయునది. తిరోధానమనగా నిర్మలపరిపూర్ణ సచ్చిదానందపరబ్రహ్మమందు అనిత్యబుద్ధి నిబుట్టించి పరబ్రహ్మమునకంటె నితరములగు దేవతలు, మంత్రములు, క్రియలు, మతములు సాధనములు నిజమని బోధించి, జననజరా మరణముల గలిగించి అధోగతిపాలు చేయునదియని యెఱుంగఁదగు.

ఈ బ్రహ్మవేత్తలందరు పూర్ణానంద పరబ్రహ్మమగు కృష్ణునకు, నిద్రావస్థాంత్యమున బొడమిన సూక్ష్మప్రజ్ఞాస్వరూపిణియయ్యు, బ్రహ్మవిద్యయగు రుక్మిణీదేవిని నిర్వికల్పసమాధిలోనిచ్చెదమని వేదాంతమహావాక్యార్థ విచారణ సేయుచుండఁగా, జీవాహంకారుఁడగు రుక్మి: అనానుభవుఁడును, అజ్ఞానభూమి కలుగు జేదిదేశము బాలించినట్టి శిశుపాలుండను నిత్యానిత్యవస్తు వివేకహీనుండును బ్రహ్మజ్ఞానమును వెలితుసను మాడజాలని దివాంధమునకు నీయఁదలంచెను. (దివాంధునిలక్షణములు పూర్వము నాచే రచియింపఁబడినది వాంధమన గ్రంథము రొుక్క ప్రథమ ద్వితీయభాగములలో విపులముగా దెలుపబడెను.)

6. బ్రహ్మవిద్యారూపిణియగు రుక్మిణీదేవిని విజ్ఞాన సమాధియందు స్థిరమై బ్రహ్మవిద్యాభిమానమున నవిద్యాసంఘముక్తంబగు బుద్ధియనువిప్రవర్యుని,యోగమార్గమున భ్రూమధ్యమనెడి ద్వారకాపురమునకుబంపి తత్పరిపాలనాధీశుండగు పూర్ణానందపరబ్రహ్మమగు శ్రీకృష్ణునికి విషయ ముక్తాపరిజ్ఞాన

మున నెఱుఁగఁబఱచెను. అట్లు బ్రహ్మానందరూపిణియగు రుక్మిణీదేవి, నిదిధ్యాస సమాధియందున బుద్ధియగు బ్రాహ్మణోత్తమునచేఁబంపఁబడినసందేశ మెద్దియన

7. పూర్ణానంద పరబ్రహ్మమయుఁడవై, రాగద్వేష కామక్రోధలోభ మదమత్సరాది దుర్గుణములకుదూరుండవై. అంతఃకరణేంద్రియములనంబఱగు స్త్రీలచిత్తములనపహరించుసమర్థతఁగలజీవజ్ఞానాకరుఁడవగుకృష్ణపరబ్రహ్మమా! త్రికాలములయందు నశింపనిమోక్షరూపవస్తువును బొందజేయు (అనగాదుఃఖ రహితమును బొందఁజేయునగు) నీచరణసేవయందు ప్రొద్దుగడపినన్ను (చరణముపాదము) పాదోస్యవిశ్వభూతాని, త్రిపాదస్యామృతందివి "అనుశ్రుతి ప్రమాణముచొప్పున పాదమనగా సకలజీవసమూహముగనుక, యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం-తత్తదాత్మేతి విచారయేత్" అనునట్లు జీవసమూహమెల్ల నీకంటెనన్యముకాదని, నిరంతరమనుసంధానముజేయుచున్న దాసను, క్షరము, అక్షరము, పరమనెడివన్నియు నొక్కటిగాభావించి, చతుర్దశేంద్రియమయములైన చతుర్దశభువనములకంటె నధికుండవగునిన్నుఁబొంది అహంబ్రహ్మాస్మి యను విజ్ఞానమునుఁ బొందఁగలను.

8. అదియునుంగాక పూర్ణానందపరబ్రహ్మమగు ఓకృష్ణా! త్రికూటమనెడిస్థలమందలి సప్తభూమికలలోఁగడపటిదై, సూర్యసోమాగ్ని మండలముల మధ్యనుంగల నొంటిస్తంభము మేడయిందు (అనగా నేత్రద్వయమునగలభ్రూమధ్య సహస్రారమున) నుండగానన్నుఁ జేబట్టఁగలవా! బ్రహ్మవిద్వరిష్ఠుండవగు ఓకృష్ణా! అవ్యయానందరూపిణినై వెలిఁగెడినన్ను, షడ్విధసమాధులలో నొక్కటియైన అంతరనిర్వికల్ప సమాధిబలమునఁజేబట్టవచ్చినపక్షమున, మాయ అవిద్యయనెడి ద్వారపాలకులతో గూడుకొనియున్న సలయవిక్షేప కషాయ రసాస్వాదరాగద్వేష కామక్రోధ లోభమోహమదమత్సరేర్ష్యా దర్పదంభాదులను నశింపఁజేసిగాని చేబట్టగాదుగదాయని చింతించెదవేని,

ఓకృష్ణపరబ్రహ్మమా! హృత్పుండరీకం, పురమధ్యసంస్థం తత్రాపి దహరం గగ నం—విశోకస్తస్మిన్ యదంతస్తదుపాసితవ్యం" అను శ్రుతి ననుసరించినవాఁడవైన రొడల నుపాయంబొండుగలదు. ఎద్ది యన, దేవీపూజార్థమై వెడలుదానను, అనగా స్వరూపాహంకారము వీడి దేహతనుభజింపఁదలంచి, అహంబ్రహ్మాస్మి అను స్వరూపాహంకారమును బొంది (సుషుప్తికాలే సకలేవిలీనే-తమోభిభూ తస్సుఖరూపమేతి, సుఖమహమస్వాప్సం-న కించదవేదిషం "అనెడివ్యక్తిత్వ మునుగలిగి సర్వేంద్రియవ్యవహారములులేనిదాననై-జాగ్రతయందు సర్వేంద్రియ వ్యవహారముగలదాననై యున్నానుగనుక అవిలక్షణమైన నేనే సలక్ష ణముఁగని ప్రజ్ఞగలదాననైయుండెదను. శ్లో॥ అహంకారకృతో బంధః ఆత్మన ద్వ్యస్తపర్యయః-అహంకారవిమూఢాత్మా కర్తాహమితిమన్యతే॥ అను ప్రమాణము చేతనహంకారము బంధకారణమనిన (యస్యాత్పశ్యతి చక్షుర్భ్యాంతత్తదాత్మేతి భావయేత్) అను శ్రుత్యానుసరణి లేనయెదుటఁ దోఁచునదంతయు దాననెడిజ్ఞాన మును బొంది బహిర్ముఖమయిన వృత్తిగలదాననై యుండుసమయంబున- ప్రపం చవాసనలోఁజిక్కి- స్వేతరవస్తుసత్వవృత్తులనుదగులక బ్రహ్మవిచారణము జేయు టకునై మావారలగు అంతఃకరణేంద్రియ నామకులగు బ్రహ్మవేత్తలు-బ్రహ్మ విద్యారిష్ఠుండగు నిన్ను జేపట్టకమునుపు ఈశ్వరివిభజించుబడుఁ అనగా స్థావర క్రిమిజలచరపక్షిపశునరసురాది సకలప్రాణులను పుట్టింపను పెంచను త్రుంపను కర్తయైన పరమాత్మయొక్క భార్యయైన బ్రహ్మవిద్యను ఆరాధించుటకునై పంపుదురు. అనగా బ్రహ్మవిచారణలో నేనుండగాఁ గనపడి ముక్తికాంతనైన నన్ను జేపట్టుమని సందేశమునంపెను.

9. అంత బ్రహ్మానందంబున నోలలాడు ముక్తికాంతయు బ్రహ్మవిద్య యునగు రుక్మిణీదేవి కరగ్రహణార్థమయి (అనగాఁనిఖిలవాంఛాపరిభ్రమణ సంసారకూపంబుననుండి యతిక్రమించుట) పరబ్రహ్మంబగు శ్రీకృష్ణుఁడు విజ్ఞానా

కరమగు విచారణమను సారథియుక్తమగు సైన్య సుగ్రీవమేఘపుష్పవలాహకంబులను తురంగంబులు=(మనస్సు బుద్ధి చిత్తము అహంకారముల నెడి గుఱ్ఱములుగల సూక్ష్మదేహమను) రథమునాయత్తము జేసుకొని, నిధిధ్యాస నిర్గుణసమాధినాబరగు బుద్ధియ నెడి అగ్ని ద్యోతనయుక్తముగా (అగ్నిద్యోతనుడనగా= అగ్ని=బ్రహ్మజ్ఞానమను అగ్నిహోత్రమునకు ద్యోతనా=ప్రకాశింపజేయువాఁడని యర్థము) అంధకారబంధురమగు విషయారణ్యముల దగ్ధముచేసివాఁడని తెలియందగు కృష్ణాంశమరథంబునెక్కి - దేహరూప [illegible] గలవాఁడై అల్పకాలములో ప్రసిద్ధములైన జ్ఞానభూమికలను దాటి విదర్భదేశంబనెడి తురీయస్థలమునకుఁ జేరెను.

10. బుద్ధి సమాధిభ్రష్టుండై విషయవాంఛాసముద్రంబున బడిపోరేమోనే మోయని ముక్తికాంతయగు రుక్మిణీదేవి తనలోదాను విచారింపదొడంగెను.

11. బ్రహ్మవిద్యారూపిణియగు రుక్మిణీదేవి తల్లియగు జ్ఞానకాంతతోనైనా తనమనస్సులోగల విచారకారణముం చెప్పదు, ఇంద్రియములకెల్ల రాజైనమనస్సు బ్రహ్మాకారముతోయుండుట చేతవాగింద్రియ వ్యాపారమగు సంభాషణము జేయదు. హృదయకమలమనెడి ముఖమునందు పొందియున్న సంకల్పాదివృత్తులను బహిర్ముఖముచేయదు. నిద్రయను మాయావరణశక్తికిలోఁబడదు. అనగా సదసద్వివేకము మఱచియుండదు. యోగబోధల నెడిస్తనయుగ్మంబుపై నొకటితో నొకటి పెనవైకొనియున్న సమతావస్థనుబొందియున్న త్రిగుణముల నెడి దండలనువిడదీయదు. ద్వారకనాబరగు భ్రూమధ్యమున నిలచియున్న దృష్టులను బహిర్ముఖముచేయదు. అనగా లోఁజూపుగలదృష్టులను వెలిచూపుగలవిగా జేయదు. జ్ఞాననేత్రంబుల బొడమిన యానందబాష్పములను తుడవదు. అనగా నిరతిశయానందమునుండి తొలఁగి విషయానందమున మునగదు తమోగుణమయంబగు కొప్పుయందభిమానముగల్గి చక్కఁజేయదు-అవిద్యా

పొందినయెడ లోకవాసనలేక యుండెడిదనుట నిత్యానందానుభవముగల దగుటచేత అన్నము మొదలైన భోజ్యపదార్థముల స్వీకరించదు. నిర్వికల్ప సమాధి యందుండటచేత నింద్రియ వ్యవహారములేవియు లేకయుండెననిభావము.

12. అనంతరము ముక్తికాంతయగు రుక్మిణీదేవి పూర్ణానందపరబ్రహ్మమగు శ్రీకృష్ణుని స్వాధీనముయినపిదప నాబ్రహ్మానందరూపిణికై కాంక్షించిన చేదదేశాధీశుండును, అజ్ఞానస్వరూపాంశలక్షణుండెడి నిత్యానందస్వరూపిణీకాంక్ష్యుండగు శిశుపాలుండను దివాంధము మిక్కిలి తాపించుచుండగా నిదిధ్యాసనరూపంబగు బుద్ధి యిట్లు నీతినిగరుపందొడంగెను. ఓ అజ్ఞానుడా! దుర్లభమైన మనుష్యదేహమునందే ప్రాణములుస్థిరమైన "ప్రాణో బ్రహ్మేతివ్యజానాత్" ను శ్రుతిచేత పంచ ప్రాణస్వరూపముతోను పరబ్రహ్మముతానని యెఱింగినపక్షమున జననమరణాదులులేక శాశ్వతముగానుండవచ్చును త్రికాలములయందు తప్పకనుండుట యేతటస్థించినచో ముక్తినిన్నెప్పుడు విడువకయుండును. (యత్సత్త్వేయత్సత్త్వంయదభావేయదభావః) అనుశ్రుతిచేత దానున్న సర్వముగలదనియు దాను లేకున్న సర్వములేదని యెఱుంగుము. రుక్మిణియనెడి ముక్తికాంతసందర్శనముఁగలుగుటచేత శాశ్వతుఁడవైతివి. (బ్రహ్మైవేద బ్రహ్మవిద్భవతి) అనుశ్రుతిచేత బ్రహ్మవిద్యార్థివై బ్రహ్మవేత్తల నాశ్రయించితివేని బ్రహ్మవిద్యయగు ముక్తికాంత నీకు లభించును. బ్రహ్మవేత్తల వేదాంతవాక్యార్థముల నిరసించిదవేని నీప్రయాసమంతయు నిష్ప్రయోజనమై తుదకువిషయవాంఛాపరిభ్రమణచిత్తుండవగుటచేత ఫలించదు. దేహధారి స్వతంత్రుడు కాడు. శ్లో॥ యావత్స్యాత్స్వగుణవైషమ్యం తావన్నానాత్వమాత్మనః । నానాత్వమాత్మనో యావత్పారతంత్ర్యం తథైవహి॥ యావన్నానాత్వజ్ఞానం తావత్కాలంకృతంభయం అని చెప్పియున్న దిగనుక యెవఁడుతనకు దేహేంద్రియాద్యుపాధులుకలవని యెంచుచున్నాఁడో వాఁడెన్నటికి పరతంత్రుఁడేకాని స్వతంత్రుఁడుకాఁడు. సర్వము

నీశ్వరాధీనముగానుండునని యాయనయెట్లు త్రిప్పుచుండునో యట్లుతిరుగుచుందువు. జ్ఞానేంద్రియకర్మేంద్రియములంతశ్శేంద్రియములు నాలుగుసత్వరజస్తమోగుణములు మూడునుగలసి పదియేడుతోఁజేరి శరీరేంద్రియములు నేననెడి అధ్యాసఁగలవాఁడవై అరిషడ్వర్గములారింటిలో దుర్జయమైన కామమువలన భగ్నుండవగుటఁగాంచి కరుణామయుండగు పూర్ణానందపరబ్రహ్మమగు శ్రీకృష్ణుండు వచ్చి-తత్త్వమేవత్వమేవతత్ అనెడుపదేశమువల్లనీలో విజ్ఞానమును గలిగించెను.

13. తదనంతరమజ్ఞానరూపకుండగు రుక్మి తన సహోదరియగు రుక్మిణీనాబ్రహ్మవిద్య పరబ్రహ్మంబగు శ్రీకృష్ణుని స్వాధీనమగుట నెఱింగి, విషయతాపత్రయాది బంధజాలంబులను బాసి మనోబుద్ధి చిత్త అహంకారములనెడి గుఱ్ఱములఁగట్టబడిన కారణశరీరమను రథమును బుద్ధినాఁబరఁగు సారథినడపఁగానందారోహణమగుటఁగాంచి, శరీరేంద్రియాదుల రూపకుండగు రుక్మి తనతోఁబుట్టువు తమ్మునిడిచి దూరమగు కారణంబున దుఃఖితాత్ముఁడై పరబ్రహ్మంబగు శ్రీకృష్ణునికెదురుగా తనస్థూలదేహమను రథమునుఁబోనిచ్చి ట్లనియె.

14. బ్రహ్మానందరూపకుఁడవగు ఓకృష్ణా! జ్ఞానరూపిణియును ఆనందస్వరూపిణియునగు నాచెల్లెలగు రుక్మిణీదేవినిమాకుదూరముజేసి అపహరించుట ధర్మమా! (మమైవాంశో జీవలోకే (అన ప్రమాణమునుబట్టి మేమెల్లరము నీ అంశమునబుట్టినవారము గావున, మాతో సమానుండవు కావుగదా! (నచక్షుర శ్రోత్రపాణిపాదం) అనిశ్రుతిచేత నీవు చతర్దశేంద్రియ వృత్తులలో నేవృత్తిలేనివాఁడవుగదా! అదియునుంగాక "ఏకోదేవో బహుధానివిష్టః - ఏకంసంతం బహుధాకల్పయంతి" అనశ్రుతివలన స్థావరజంగమ ప్రాణిరూపములలో నీవేయున్నావుగనుక నిన్నేజాతివాఁడవని నూహించఁగలను=నజాయతే మ్రియతే వాకదాచిన్నాయం భూత్వాభవితావానభూయః । అజోనిత్యశ్శాశ్వతోయం పురాణోనహన్యతే హన్యమానేశరీరే" అను గీతాప్రమాణముచేత నీవిట్టిచోట

పుట్టితివనియు నట్టిపోటుపుట్టితి వనయు నెట్లుచెప్పఁగలను. నీవుత్రిగుణాత్మకుఁడవుగనుక మంచిచెడ్డలీరెండును నీయందులేవు-అదిగాక (సదసచ్చాహమర్జున) అనునట్లు నీవుసదసద్రూపుఁడవు, నిన్నెవరు తెలుసుకోఁగలరు. నిన్ను తెలుకొనువారు నీవేయనిభావము. (సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా) అను ప్రమాణముచేత సర్వవ్యాపకుఁడవు. నీవుస్థూలకారణ శరీరములు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు విశ్వతైజస ప్రాజ్ఞనామములు మొదలగువ్యవస్థలను పొందుటయులేనప్పుడు శుద్ధనిర్వికల్పుఁడవుగా నిరంజనుఁడవుగానుండుట నీవిభూతియది. (ఏకమేవాద్వితీయం బ్రహ్మనేహాస్తి కించన) అనెడి యీనిర్వికల్పసమాధిలోనిదాస్థితినుండునప్పుడు నీకుశత్రులుమిత్రులు లేరు.ఆస్థితినివదిలి జాగ్రత్తకు వచ్చినప్పుడే శత్రుమిత్రాదులుగలవాఁడ వగుదువు ॥శ్లో॥ క్రీడార్థంసృష్టి రిత్యన్యేభోగార్థ మితిచాపరే। దైవస్యైషస్వభావోయ మాప్తకామస్య కాస్పృహా అనిలేక మత్స్యకూర్మవరాహాది రూపములుధరించి శత్రువులతో యుద్ధముచేయుదువు నీవు రాజాధిరాజవేకాని జరాసంధాదిరాజులతో సమమైనవాఁడవుకావు నీవేపితృమాతృ భ్రాతాది స్వరూపములతో నుండువాఁడవుగాన నీవునాకును నాసహోదరియగు బ్రహ్మవిద్యారూపిణియగు రుక్మిణీదేవిని దూరముచేయుట పాడిగాదన బ్రహ్మవిద్వరిష్ఠుండును జగద్గురుండునగు శ్రీకృష్ణుండు ప్రపంచకవిషయాదుల రూపుఁడగు రుక్మిని యావాంఛావిముక్తతను లక్షణమునకు మార్పుజేయదలంచి వానినివిరూపునిగాఁజేసెను-అజ్ఞానరూపునుండితొలగించెను. అనగా జ్ఞానమును కలగజేసెను.

...పమున రుక్మిణీకళ్యాణాంతర్గత గూఢార్థమునుగ్రహించి ప్రతియొక్క... ...తమశరీరమే విదర్భపురమనియు. కుండినము హృదయమనియు పాలనాధికారి ఆత్మయనియు నిత్యానందమే రుక్మిణియనియు జీవేశ్వరైక్యమను లక్షణమున రాగద్వేష కామక్రోధలోభమోహ మదమాత్సర్యరూపకులగు రుక్మిజరాసంధాదుల జయింపవలయునని యు నట్లుజయప్రియులైనచో నిత్యా

నందకూశీతీయగు రుక్మిణి కరగ్రహణాధిక్యత సహింపగలరనియెడివిజ్ఞానమును సద్గురూపదేశమున నెఱింగి_శ్లో॥ భార్యాజలూకేసహజాదిగర్తే పుత్రాదిమీనే గృహబాడబాగ్నౌ। ఆశాతరంగే భవసాగరేస్మిన్ మగ్నంసముద్ధారయ చంద్రమౌళే అనుప్రమాణముచొప్పున సతీసుతాదిరూపసంసార సముద్రములో మునిఁగి యొడ్డుకిఁజేరఁగానక పునరపిజననం పునరపిమరణం అనుతరంగములంబుమండి బడసహస్రబాధల్నొందువారలకు నిదియొకసహాయకరముగు పారమనినావెఱ్ఱి తలంపునందుంకరముచేసితినో విపులార్థముగల యీరుక్మిణీకళ్యాణాంతర్గత గూఢార్థమును సంగ్రహరూపకముగా దెలియఁజేసితిని. విజ్ఞులగువారలిందెచ్చటేని లోపములంగాంచినచో క్షమింపగలరని నాప్రార్థన.

ఇట్లు,

గ్రంథకర్త.



| పుట | పద్యము | చరణము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 1 | 3 | ఆరాదింప | ఆరాధింప |
| 1 | 1 | 4 | వేకంకట | వేంకట |
| 3 | 9 | 3 | ప్రశంశ | ప్రశంస |
| 8 | గద్య | 2 | కథాకర్ణంబు | కథాకర్ణనంబు |
| 7 | పద్యము(24) | 4 | బలికెలి | బలకె |
| 47 | 11 | 4 | అయ్యె | అయ్యె |
| ,, | 12 | 2 | పీరుఁకిఁ | నీరులకుఁ |
| 52 | 32 | 4 | తనూజగు | తనూజకు |
| 55 | 41 | 2 | బృందముగూడి | బృందముంగూడి |
| ,, | గద్య | 9 | భంజకల | భంజికల |
| 65 | పద్య 78 | 2 | బోయినిఁ | బోయనిఁ |
| 67 | 84 | 2 | వడిసి | వడసి |
| 68 | 87 | 3 | నేత్రుల | నేత్రిల |
| ,, | 90 | 4 | విక్రిమ | విక్రిము |
| 70 | 97 | 1 | శౌనికా | శౌనకా |
| 71 | 1 | 3 | రాజాది | రాజాధి |
| 73 | 8 | 5 | ఏతెంచ్చి | ఏతెంచి |
| 74 | 13 | 1 | అచును | అనుచు |
| ,, | గద్య | 1 | కన్నయ | కన్నియ |

| | | | | |
|---|---|---|---|---|
| 75 | పద్యము 18 | 4 | ప్రిదాయ | ప్రిదాయి |
| 77 | 27 | 4 | అనుకూలము౯ | అనుకూల్యము౯ |
| 80 | 42 | 2 | ముద్ధులిడి | ముద్దులిడి |
| 84 | 57 | 4 | అరుణముంజెందె | అరుణఁడైపోయె |
| 85 | 61 | 3 | లలామాకు | లలామకు |
| 87 | గద్యము | 1 | తీక్షణంబున | తీక్ష్ణంబున |
| 92 | పద్యము 82 | 8 | శీతుకృతులు | శీతకృతులు |
| 96 | 94 | 8 | జేపిరి | జేసిరి |
| ,, | 97 | 2 | వీడంత | వీఁడంత |
| 101 | గద్య | 6 | వెలెంగెడి | వెలింగెడి |
| 105 | 6 | 2 | సుంరాంగి | సుందరాంగి |
| 106 | పద్యము 12 | 4 | ఖగరాడ్వాహుని | ఖగరాడ్వాహనని |
| 107 | రగడ | 9 | రాజు | రాజ |
| ,, | ,, | 18 | హారణముఁ | హారణముం |
| 109 | పద్యము 5 | 17 | తేరుఁ | తేరఁ |
| 115 | ,, 39 | 2 | అఁదంబుదన౯ | అందంబున౯ |
| ,, | ,, 41 | 4 | దళాయనేత్రు | దళాయతాక్షు |
| 117 | దంపకము | 4 | కంది | కంధి |
| 128 | పద్యము 11 | 2 | సాద్యంబు | సాధ్యంబు |
| 129 | ,, 13 | 1 | నాత | యాత |

| | | | | |
|---|---|---|---|---|
| 130 | గద్య | 3 | అలంకృతిఁ | అలంకృతఁ |
| ,, | పద్యము 17 | 2 | యాణరీ | నాణరీ |
| 133 | గద్య | 2 | పగిదియచ్చటఁ | పగిదినచ్చటఁ |
| 135 | పద్యము | 4 | భద్రిలు | భద్రిల |
| 136 | గద్య | 12 | పాలంబులును | ఫాలంబులును |
| 136 | ,; | 16 | మహార్ణవంబెల | మహార్ణవంబు లే |
| 140 | పద్యము 24 | 4 | ద్రెళ్లఁగ సేయు | ద్రెళ్లఁగ నేయు |
| 143 | ,, 34 | 2 | సీకుఁ | సీవుఁ |
| 144 | ,, 38 | 5 | రాజమాన్య | రాజమాన |
| 146 | ,, 42 | 2 | నేతుల్ | నేతల్ |
| 150 | ,, 62 | 2 | రుక్మిణిపల్లివదళపాణి | రుక్మిణిఁబల్లవదళపాణి |
| 152 | ,, 67 | 3 | మేలివకా | మేలయకా |
| 156 | ,, 84 | 4 | వారామ్నిధి | వారాన్నిధి |
| ,, | గద్య | 5 | ఇందా | నిందా |
| ,, | ,, | ,, | అనవర | ననవర |
| 157 | గద్య | 9 | అష్టభార్యా | నష్టభార్యా |
| 158 | 88 | 2 | భవు | భవ |

 పాఠక మహాశయులకు హెచ్చరిక.

ఈ గ్రంథకర్తగారగు కవితావిశారద పంతం ఆంజనేయులుగారిచే రచియింపబడిన గ్రంథములన్నియు మావద్ద దొరకగలవు

"మోక్ష సాధని" 0-4-0

ఈ గ్రంథము సగుణ నిర్గుణోపాసనగల భక్తులకు ఉపయోగకరమైనది. మనోహరమైన పద్యములుగల కావ్యము చదివి తీరవలయును.

"దివాంధము" (పద్యకావ్యము)

ప్రథమభాగము. 0-5-0

ద్వితీయభాగము. 0-6-0

ఈ గ్రంథములో సన్యాపదేశచరిత్రము - నీతి - వేదాంతము. ఈ అర్థత్రయము గ్రంథమంతటను గానబడును. ప్రతి పద్యము చిత్రవిచిత్రముగా పూరింపబడి చదువరుల హృదయముల నాకర్షింపఁగల మహాశక్తిగలది.

శ్రీ పాండురంగశతకము. 0-6-0

ఈ శతకమిప్పటివరకుగల శతకములన్నిటికి మకుటము. ప్రతిపద్యములో సారమైన భక్తిభావముగలిగి శ్రీ పాండురంగ నాథునితో భాషించు నట్లుండును.

ముద్రణములో నున్న గ్రంథములు

"భక్తనామదేవు" (నాటకము)

శ్రీ పాండురంగని లీలలన్నియు నిందు ప్రదర్శింపబడును. ఎట్టివిషయ వాంఛయుదైనను ఈగ్రంథము నొక్కపర్యాయము పఠించినచో తన్మయత్వము గలిగి భక్తిపరవశుడగును.

శీఘ్రముగా సారస్వతలోకమున కందజేయబడును.

కొండా వీరయ్య,
పుస్తకములవ్యాపారము
మహాకాళి వీధి,
శికింద్రాబాదు.